సీ॥ దినకరా! నీకేటి • తీయురోగము వచ్చెఁ
బొంద రాకుండి యే • బొందఁబడితి?
వారివాహా! పోవు • వాయువ సోకెనే?
కోర రాకుండి యే • కోలఁబడితి?
వనిలంబ! నీకెట్టి • యనలంబు దరికొనె
గాన రాకుండి యే • కానఁబడితి?
వనలుఁడా! నీకేమి • యపరబుద్ధి జనించె
నీడ రాకుండి యే • నీడఁ బడితి?

గీ॥ వనుచుఁ దత్తత్క్రియాకలా • పానుసరణ
నిష్ఫలోద్యోగి యగుటచే • నిస్పృహామెయి
దిగులు తగిలి నొగులొంది • పొగులుచుండె
దేవమర్త్య పాతాళస్థ • జీవవితతి॥   ౪

ఉ॥ వేయికరంబులున్న భుజ • వీరుఁడొకండట ప్రౌఢిఁజూపఁగా,
వేయి శిరంబులున్న బుధ • వీరుఁడొకండట బుద్ధినెన్నఁగా
వేయి పదంబులున్న రణ • వీరుఁడొకండట గొప్ప గొప్పలే
చేయుదురంట తప్పిపోఁగొని • దిక్కొనొ వారి కడిందిబీరముల్॥

సీ॥ కంఠముల్ దగ నెండె • గంగాపతిం జేర,
సత్తువకొలంది ప • ర్వోత్తరయ్య
జ్వాల తూలి తొలంగె • ఫాలాక్షు జేరంగ,
సత్తువకొలంది ప • ర్వోత్తరయ్య
బువ్వ లేదాయన్న • పూర్ణాపతిం జేర,
సత్తువకొలంది ప • ర్వోత్తరయ్య

మిత్తి పైకొనఁ బూనె ♦ మృత్యుంజయునిఁ జేర,
సత్తువకొలంది ప ♦ ర్వెత్తరయ్య

గీ॥ యింద్రుఁ డతిరంధ్రుఁ డజుఁడు తా ♦ నేమెఱుఁగఁడు
భూమి విడువదు కూర్మంబు ♦ పొందు వేగ
దిక్కు మనకింక శివుఁడంచు ♦ దెలసికొనుచు
సత్తువకొలంది వేగ ప ♦ ర్వెత్తరయ్య 10

గీ॥ అని ప్రబోధించుకొనుచు దే ♦ వారి తీవ్ర
హింసలకు దూలి "హా! పార్వతీశ ♦ రక్ష!
రక్ష" యను భక్తులకు బ్రోవ ♦ నాక్షణంబె
పూని రుద్రుండు సంగరం ♦ బునకు నడిచె॥ 11

వ॥ అంత నచ్చట.

గీ॥ పొలసుదిండి దండు ♦ పొదల రక్కసి ఱేఁడు
నేలనొక్కి మిన్నుఁ ♦ గేలనొత్తి
హాయి నెసఁగుచుండి యా ♦ హరుపూనిక
తెలిసి దాడివెడలె ♦ తీవ్రగతుల॥ 13

సీ॥ మిత్తి నొత్తినవాఁడు ♦ మత్తు లత్తెడివాఁడు
సత్తువల్ తులజూడఁ ♦ జనుచునుండ
గిబ్బనెక్కెడివాఁడు ♦ గబ్బు గ్రొక్కెడివాఁడు
హెచ్చులొచ్చునుఁ జూడ ♦ నేగుచుండ
కొండ నుండెడివాఁడు ♦ కండ మెండగువాఁడు
నాటుఁబోటును చూడ ♦ నరుగుచుండ
పునుకఁ దాల్చెడువాఁడు ♦ కణతు లొల్చెడువాఁడు
ఢీకిఢీయనుచు ఢీ ♦ ఢీలఁదివుర

వీలుఁగలవాఁడు మఱియొక్కన • వాలుతాల్చె
గెలుచునని కొంద ఱీవైపు • కేక లిడఁగ
నిలుచు నీవేళ మానవాఁడె • నిత్యమనుచు
బలిసి రక్కసిదండు సం • బరము నొందె॥ 14

క॥ ఈతీరున సురలసురులుఁ
బాతరలాడుచుఁ జెలంగఁ • బటురభసమునన్
బోతరము ద్రుంతు రారా
రాతిరి జొరకుండ దుష్ట • రాక్షసయనుచున్॥ 15

ఉ॥ శంకరుఁడల్గి పల్కిన ని • శాచరవీరుఁడు క్రోధమూర్తియై
చంకలనున్న మొండెములు • సాచి లటుక్కననోటవైచి యే
డ్రాంకుని ఘోరచూడ్కిఁగని • 'హాహ్హహ' యంచు నదల్చి
కొంచు లోఁ
గొంకక ద్రుంగె రక్తముఁ బొంగులొక్కని నోటికెలంకులందు రాన్॥

ఉ॥ క్రోధముమూర్తిఁ దాల్చినన • గ్రుడ్డులనిప్పుకలుర్ల రక్తసి
క్తాధర కాంతి భీకరత • సాతికఘోరతరాస్య మగ్నిసం
బాధితమట్లుగాఁగఁ బర • మ్రపళయోగ్రి మహాట్టహాసము
త్సాధితగార్ధభస్వనము • చూప్పన రాత్రిచరేంద్రుఁడుద్ధతిన్॥

శా॥ ఓరీ! యెవ్వఁడవీవు? నన్నెఱుఁగవో? • యొక్కింత యో
చింపు మ
త్సారోద్యద్భుజదర్ప వైభవమునన్ • సాధించితిన్ లోకముల్
పోరన్ గల్గిన పోటుమానిసుల తెం • పుల్ తున్మపులై గూలె నీ
సారం బేమిటఁ గొప్పవాఁడికనరా • తు క్రోధదుర్వారుఁడై॥ 18

ఉ॥ కాలముడాసె నీదుకడ♦గండ్లికమానుమురోరి! దుష్ట! వా
చాల! వెడంగుమానిసులు ♦ చాలరటంచు మదగ్రమందు నీ
నాలుకఁ ద్రిప్పుఁజూచెదవె ♦ నాప్రదరంబోకైపుఁజాలు ని
ర్మూలముజేయ నిన్నెటకుఁ ♦ బోయిన నెచ్చటడాగియుండినన్॥

శా॥ శంభుండీగతిఁ దన్నుదల్పగమహా ♦ శక్రోధదోర్దర్పసం
రంభంబుంగని యానిశాటుఁడణుమా ♦ త్రంబేని శంకింపకే
దంభత్వంబున డీకొనెన్ బెలుచ యు ♦ ద్ధంబప్పుడత్యుగ్రమై
జృంభించెన్ నిజతీవ్రతన్ నిఖిలప్రా♦ణివ్రాతముల్ మ్రాన్పడన్॥

క॥ లీలాగతి హేలామతి
శూలాయుధుఁడాలమందు ♦ సోలించె మహా
వ్యాళవిషజ్వాలాయుత
శైలీముఖకీలినాని ♦ శాచరుఁబెలుచన్॥ 21

శా॥ రక్షోనాధుఁడుఁ గొంతసేపటికి ధై♦ర్యస్ఫారుఁడై లేచి లో
కక్షోభంబుగనార్చి ఘట్టనలభూ ♦ కంపంబు సంధిల్లఁదీ
వ్రాక్షీణోగ్రశిఖాస్ఫులింగజనక ♦ ప్రౌఢాత్మకౌక్షేయకో
ద్వాక్షేపంబున శంభువక్షము సమా♦భీలంబుగన్ మోదినన్॥22

ఉ॥ వక్షముప్రక్కలించు గుటి♦వచ్చుడుదెబ్బకుఁదప్పదూఁకి ఫా
లాక్షుఁడు, అప్పవిప్పికను ♦ నంతటిలోఁ, బ్రిదరోగ్రవేగమున్
శిక్షయొనర్పలేక భువిఁ ♦ జేరుగడన్ బడు నాసిశాటు, హా
ర్యక్షము హాస్తిమస్తకము♦నట్లు, శిరంబున బిట్టతట్టినన్॥ 23

మ॥ ధరణిన్ ద్రెళ్ళియు బంతిపోలికమహో♦ద్ధత్యంబునన్ లేచిభీ
కరశౌర్యోద్ధతిఁ గుంతపట్టి సగదా ♦ ఖడ్గాదిసత్సాధనో

త్కరవర్షంబులఁ బెంపుఁ దెంపడర ర • క్తస్నేనసాయంబుగాఁ
హరుమీఁదన్ బఱపెన్ నిశాచరగణా • ధ్యక్షుండు రౌద్రాకృతిన్

క॥ నడుమన్ గొన్నిటివిల్లున్
విడియువిడని కొన్నిటిని ప్ర • వీణతమెఱయన్
వడివడిఖండించె హరుం
డెడమీయని యంపవాన • నింతింతలుగాన్॥ 25

ఉ॥ అంతటఁ బోక మార్గణశ • తాయుతముల్ నిగిడించి పార్వతీ
కాంతుఁడు దైత్యవాహినులఁ • గల్గు విభేంద్రతురంగవీరయూ
థాంతరుఁడై నితాంతము ని • రంతరమున్నగు శౌర్యసంపదన్
బంతముఁ జూప వీర్యమఱి • పాఱె నిశాచరరాజసైన్యముల్॥

గీ॥ రుద్రమూర్తి మహారౌద్ర • ముద్రఁ జూచి
యతని తీవ్రాశుగపటుత్వ • మణపనోడి
పంచబంగాళమగు సేనఁ • గాంచి యసుర
తీక్ష్ణరోషానలోదగ్ర • తేజుఁడగుచు॥ 27

శా॥ సేనానేకములన్ మరల్చుకొని రా • శీభూతదర్పాధ్యుఁడై
యానోద్రేక వికంపమాన భువన • వ్యాపారుఁడై బాడబ
శ్రీనాట్యంబొనరింపరూపుఁగొనిన • చ్చెన్ నాఁగ నాగ్నేయబా
ణానీకంబుల ఫాలనేత్రుపయినే • యన్ సాగె నెక్కుమ్మడిన్॥

క॥ తాళఫలాకృతులు మహా
వ్యాళాకారములు పనస • వర్తులములు సు
జ్వాలాయుతములు నయుత
శ్రీల నయఃపిండతతులు • శివుఁ జేఁ టయున్॥ 29

క॥ ఉక్కోన నగ్ని ప్రళయము
నాకల్పించునవి విషము • హా వాయుభరో
ద్రేకములు భీకరోద్ధతి
నాకాలగళాంతికమున • కరుదెంచుటయున్॥ 30

ఉ॥ యోగబలంబునన్ దనువు • నుగ్రతఁ బెంచి మహోగ్రశక్తినం
దాగమసూక్తి రేఁపిన న • యఃప్రభవాండము లెల్ల వీఁగి ముం
దేగుటమాని వెన్కకున • హీనగతిన్ బఱతెంచి తాఁకి ర
క్షోగణమారణంబునకుఁ • జొప్పడె తప్పినవాఁడు పాఱఁగన్॥ 31

మ॥ తనశస్త్రాస్త్రచయంబులే నిజచమూ • దాహంబుఁ గావించుటల్
గని యూహల్ సనమొండి ధైర్యమునను • ల్లాపాతమోనాగదన్
గొని తీవ్రోద్ధతిఁ బైపయిన్ గవిసె ర • క్షోనాథుఁడక్షీణక
క్షు సధిక్షిప్తవిరోధిపక్షుఁడయి ద • క్షధ్వంసి శిక్షింపఁగన్॥ 32

క॥ ఉడికించి యసురనడుగుల
బడలించి మహోగ్రవృత్తి • పలుచనగా నో
క్కెడ శూలధార నతనిన్
బడనడఁచె త్రిశూలధారి • పటురోషమునన్॥ 33

క॥ కూలుచు 'నోం హర! హర!' యని
వ్రాలినభక్తిన్ స్మరించు • వానిన్ గనినన్
జాలి జనించుడు నాతని
మ్రోలన్ శ్రితరక్షకుండు • మోదంబెసఁగన్॥ 34

చ॥ నిలచి యహో గజాసుర! యనిందితధర్మచరిత్ర! నీవలెన్
గొలిచి ననున్ బ్రమోదరస • గుంభననిల్పినవారు లేరు నిన్

దలఁచిననీగుణంబుల య ♦ థార్థశుచిత్వము నెన్ని కొన్న నా
కేలదికి పాఁటె దుఃఖము ప్ర♦కోపితమయ్యెడు నేమి సేయుదున్॥

ఉ॥ నీహృదయంబునన్ వసతి♦సల్పినకాలమునందు నాపుహా
త్సాహము నాసుఖంబు మితిఁ♦జక్కఁగఁ దెల్ప వశంబుగాదు నీ
యూహానుకోర్కె యేదయిన♦నున్న వచింపుము తీర్చువాఁడ 'జే
తాహ'మటన్న బుద్ధినిభ♦యంపడఁబోకుము దానవేశ్వరా! ॥

మ॥ అని కారుణ్యముచిత్తవీధిఁదలచ్చై♦యంతంతనుప్పొంగి మూ
కనులన్ పోరణగండ్ల నశ్రుగతి సాం♦గంబాస్యమున్ నిండఁ జె
ల్కిన శ్రీశంకరువాక్యముల్ విని తమ♦ త్తిన్ మోదవారాశిలోఁ
దనసర్వసముమున్గి హాయిఁగన నా♦దైత్యుండు సంతుష్టుఁడై ॥37

శా॥ దేవా! నీకృప దుర్లభార్థగురుల ♦ బ్ధిన్ గాంచి పాతాళభూ
దేవాంశస్థులు పొందరానిపదయు ♦ క్తిన్ బొందితిన్ దుష్టినా
భావంబందొక లోటులేదిఁక, భవ ♦ త్పాదాబ్జసాయుజ్యలో
కావాప్తిం గనుకంటె శంకర! పరే ♦ శా! ధీరభక్తావనా!॥ 38

మ॥ అతిఘోరుండయి మాయమాధవుడున♦న్నగ్గించి యెగ్గించిన
స్థితి నామానసనీమనున్న నిను మ ♦ త్తేమంకరున్ గొన్న ను
ద్ధతిఁ గ్రోధాంధుఁడనై యొనర్చితి మహా♦దౌష్ట్యంబులెన్నేని యు
క్కతలింకెన్నక నన్ను సాఁకఁగదవే ♦ గౌరీమనోవల్లభా!॥ 39

మ॥ అడుగన్ జానిది యెట్టి భక్తవరులే ♦ నందంగ లేనట్టి దె
న్నడు నింతేని వాసంగు లేనిధి దయన్♦ నాకున్ ప్రసాదించితీ
వడుగన్ నేరని బిడ్డకున్ జనని యె ♦ ట్లారీతి విఖ్యాతి నో
యుడు రాడ్భూషణ! కోరఁగాఁదగినదే♦ మున్ముందు విచారించినన్॥

మ॥ అయినన్ ద్వత్కరుణావిశేషమునని♦ర్లోఁగాక లోకంబులం
దయథార్థంబు నశించి సత్యమెజయ ♦ వ్యాపారమై సర్వని
శ్చయముల్ దావకభక్తిపూర్ణతఁగనన్ ♦ శాసింతురీగా కుర్వరా
నయపాలుల్ నృపులెప్పుడున్ నిహతవి♦ఘ్న ప్రాజ్యసామ్రాజ్యులై॥

గీ॥ నాదు పరిస్థానములలోన ♦ నలిగి బాధ
నవయు జీవుల కధికసౌ ♦ ఖ్యంబు నొసఁగి
కరుణఁజూడవె నీపద ♦ కంజములకు
సాంబశివ! కూర్తునిదె కడ ♦ సారిమ్రొక్కు॥ 42

చ॥ అభిరతపార్వతీపరిణయుఁ ♦ డై వనవీధివిహారసౌఖ్యపుఁ
శుభగతినుండియున్ దొలఁగి ♦ శుద్ధతపోనియమప్రయుక్తున
య్యిభముఖదైత్యుడెందమున ♦ నెంతయుఁ బ్రీతివసించి యున్న యా
యభవుఁడు వానియంతిమపు♦టాశనుదీర్పఁడె యెట్టిదేనియున్॥

వ॥ దయాళుం డగు నా భక్తపరతంత్రుండు నిజనివాస పరిపూతం బగు నగ్గజాసురు చర్మం బాత్మపరిధానంబుఁగా నొనర్చికొని యాతని శీర్షంబు శూలాగ్రంబునం గైకొని నిఖిలలోకసంశోభాపాదకుం డయ్యె నంత॥ 44

గీ॥ భువనముల సేమమమరె ది ♦ గ్భూమిపాల
వరులకలవడె స్వేచ్ఛ సం ♦ బరము నొంది
జీవతతులెల్ల సౌఖ్యసం ♦ జీవిఁ బడసె
శ్రీశివధ్వజకాంతులు ♦ చెలఁగ దిశల॥ 45

చ॥ దనుజువధించి శూలిప్రమ ♦ దంబున నేగిన నద్రిజాత మ
జ్జన మొనరింపఁబోవుచు ని♦శాంతమొరుల్ జొరకుండఁగాపుఁగా

నుని చెను నల్గుపిండిఁగొని • యొక్క సువిగ్రహమ్మున్ సృజించియం
దనిలమునూది వానినఖిలాస్త్రసమేతు సమర్థుఁ జేయుచున్ ॥46

గీ॥ ఆకుమారు మూర్ధాఘ్రాణ • మాచరించి
యతని పుట్టువకును హేతు • వాడియాత్మ
ధర్మపరతంత్రుఁ జేసి యా • దక్షతనయ
యరిగె లోనికి జలకంబు • లాడు వేడ్క॥ 47

ఉ॥ అచ్చటసామబూసురుని • నంతకు పొంతకునంపి యాశ్రితుల్
ముచ్చటలచ్చటల్ జెలఁగ • మూఁగినుతించుచుఁ దోడఁ రాగ నా
సచ్చరితుండు శంకరుఁడు • సద్మముఁ జేరి చొరంగఁ బోవుచోఁ
జెచ్చెరనడ్డినిల్చె సతి • చిన్ని కుమారుఁడు ద్వారపాలుఁడై॥ 40

కం॥ జయమొంది సతికిఁ దెల్పఁగ
రయమునఁ జనుదెంచు నాకు • బ్రీతివై యిచటన్.
భయమింత లేక నిలచెదు
నయమునఁ దొలఁగుమని హరుఁడ • నన్ బాలకుఁడున్ ॥49

చ॥ కసులను తేఱవిప్పి యిఱు • గమ్ములఁ జేతులనాని మోముపై
నును నెఱివెండ్రుకల్ నిగిడి • నూత్నకళాభ్యుదయం బొసంగ నా
యనువతికోమలంబుగ గృ • హంబుఁ జొరన్ దగదంచు రూఢిఁ బ
ల్కినఁ గడువింత పాటొదవఁ • గేవలమద్భుతసంభ్రతాత్ముఁడై॥

ఆ॥ వె॥ అదుపు బెదరు లేక • యట్టిట్టు లెదురాడె
దెవర వెవరి యాజ్ఞ • నిందు వసతి
నీదు రూపుఁ జూడ • నెనరు బుట్టెడు వేగఁ
దెలుపుమనుచు శివుఁడు • బలుకుటయును॥ 51

కం॥ మాయామ్నాయుని చె నన్నిట
నీయామ్నాయుఁ జెప్పఁగొనుమి • నేనెవరఁగునన్
నీయులు కేటికి నో బే
లా యరుగుమి వచ్చుత్రోవ • నరుగవయేనిన్॥ 52

కం॥ చెప్పెదనుబుద్ధి నీవిట
ముప్పునఁబడకుండ వేగఁ • బొమ్మెట కేనిన్
దెప్పునఁ బోవేనియు నీకుఁ
దప్పదు తగు 'శాస్త్రి' నీకు • తరలుముకడఁకన్॥ 53

గీ॥ బాలుఁ డిట్లుదలింపఁ గో • పంబుఁగొనుచు
ఖడ్గధరుఁడై రుషాతిభీ • కరతఁదాల్చి
రుద్రుఁడా బాలుఁబోరిఁగొను • రూఢివడువ
నచలుఁడై వాఁడు తనతల్లి • కాత్మ నెరఁగి॥ 54

చ॥ మెఱపు తెఱంగుగా నుఱికి • మేలిమి వాఁడిశరంబులన్ హరున్
గొఱకొఱనూర్పు లుప్పతిలఁగొట్టిన నద్భుతమయ్యె బాలునే
ర్పెఱ; ఘనఖడ్గచంక్రమణ • తీవ్రతఁ దచ్ఛరవర్ష మాగి బి
ట్టుఱుముచు ఫాలనేత్రుఁడు క • ఠోరతరప్రధనాట్టహాసుఁడై ॥55

వ॥ అడరం దొడరిన నచ్చండికాతనయుండు నఖండ రోషరసవిజృంభితగాత్రుండై దివ్యశరజాలంబు లాభీలతరంబులుఁగా నేయుచుండు నెడ॥ 56

సీ॥ ప్రళయకరాగ్నేయ • బాణమేసిన నద్ది
ఫాలాక్షు నొసట ప్రా • ల్మాలినిలచె
ననుపమాధికవారు • ణాస్త్రమేసిన నద్ది
గంగాపతిశిరంబుఁ గాఁడిమడఁగె

విషధరాంబకమేయ • విషమాస్త్రమదియేగి
కాలకంఠుని కంఠ • గతి నడంగె
బ్రబలప్రకంపనప్రి • దరమేసిన నద్ది
యాదియోగీంద్రుబా • హ్యమునఁజెదరె

గీ॥ నిటులు దివ్యశరంబులు • హీనబలము
లై మహేశ్వరునవయవ • సీమలందు
గల యుటలుఁజూచి ఖడ్గంబుఁ • గైనమర్చి
యుగ్రదెసఁగాళికా, పుత్రుఁ • డుదుటుమీఱ॥ 57

కం॥ నడచిన 'ఖం'గని' ఖ'ట్టని
యెడ మ్రోఁతల నగ్నికణము • లెగయఁగఁబిడుగుల్
దోడరె ననవారిఖడ్గము
లెడ తెఱపియు లేక తాఁకె • నెగసి చెలఁగుచున్॥ 58

కం॥ లోకభయంకర రాక్షసుఁ
డాకరణిన్గూలెననెడి • యామోదమునన్
భీకరమై భువనత్రయ
శోకావహమయ్యె దురము • శూలికతనికిన్॥ 56

కం॥ ఒండొరు క్రేవల'రుఁ'య్యని
మెండుగ నాదంబు లొలయ • మేనులనందం
దుండలుగఁ గండలెగయఁగ
భండనముగ్రిందుశక్తి • బాలుఁడొనర్చెన్॥ 60

కం॥ ఒకయెడఁజూపుచుఁ జెంగున
నొకయెడ ఖడ్గంబుతోడ • నుగ్రతమీఱన్

వికలముగ మోఁదుకొనుచున్
బ్రకటోద్ధతిఁదప్పి చనుచుఁ • బఱచి తగులుచున్ ॥ 61

కం॥ చుట్టున్ బఱచుచుఁ దాఁకిన
నెట్టన రక్షించుకొనుచు • నిర్జిద్రిగతిన్
ధట్టించిమారలఁ దాఁకుచు
దిట్టలగుచు రక్తపూర్ణ • దీపితతనులై ॥ 62

వ॥ పోరు నెడ॥ 63

ఉ॥ బాలుఁడు బాలుఁడే సకల• భండనచండిమఁ బేర్చియార్చు నా
శూలినిమించునే? సమత• నొప్పడునే? భువనప్రవర్తనో
న్మూలనశీలియౌ ప్రళయ • మూర్తికి దీటగుశక్తియుండునే?
కాళియనుగ్రహప్రతిభ•గల్గుట సంచుకయౌఁగె గాకటన్ ॥ 64

గీ॥ ఉగ్రుఁ డధికతరాగ్రహ • వ్యగ్రుఁ డగుచు
నగ్రమున సర్వసమరస • మగ్రశౌర్య
మగ్రిచిన్ బోరుబాలు ఖ • డ్గాగ్రధార
నిగ్రహించె శిరంబవ • నింబడంగ॥ 65

మ॥ విజయోత్కంఠత నన్యముల్గొనక శ్రీ•విశ్వేరుండప్పు గో
త్రిజఁ గాంచన్ జని రాక్షసేశ్వరుని యు•ద్ధప్రక్రియన్ దెల్పి తా
నుజయుంబొందుట భక్తులెల్లరును సం•తుష్టాత్ములౌటల్ దుదిన్
నిజగేహాగ్రమహాగ్రభండన కథన్ • వేడ్కన్ నివేదించినన్ ॥66

గీ॥ విజయశీలత పతిపల్కు • వేడ్కమాట
యాశ్రితులు బ్రోవఁబడిరన్న • హాయిమాట,

విని ముదంబందు పార్వతి • తన కుమారు
నిధనమాలించి నిలువెల్ల • నీరుగాఁగ॥ 67

ఉ॥ భాసురతోషమొంది నిజ • భర్త నెదుర్కొని కౌఁగిలింపకే
హా! సుకుమార! హా! గురుజ • నానుగుణస్థిర ధీర! హా! సుతా!
హా! సుమనోహరా! యనుచు • నర్మిలి నేడ్వఁదొడంగె గౌరి చిం
తాసముదగ్రకంపితమ • నంబున చేష్టలుదక్కి ముగ్ధయై॥ 68

గీ॥ జయసమాలబ్ధమగు సంత • సంబు వెలుచ
శుష్కమై పార నబ్రిమ • చ్చోటమీర
నట్టి నిలుగుండెబడి కొంత • యరసి తుదకు
గాంచె తనయునాలోచిత • కార్యఫలము॥ 69

ఉ॥ కాంచి సతీప్రియంబునకుఁ • గాఁగఁ దదర్భకు జీవయుక్తుఁగా
వించుట లెస్సయంచు చని • విశ్వమయుండు తదీయశీర్షమా
పంచను లేమిమొంజెమున • భద్రముగా గజదైత్యుమస్తకం
బుంచుచుఁ బ్రాణవాయువుల • నూపిరివోసి సజీవుఁ జేయుఁడున్॥

గీ॥ నాసుతుండిదె జీవించి • నాడటంచు
నేమమున నామకరణాది • నిఖిలకర్మ
లభినవప్రేమఁ జేయించి • యచలతనయ
సుతుగజాననుఁ డని పిల్చె • శుభగలీల॥ 71

వ॥ అంతం గొంత కాలంబునకు॥ 72

చ॥ నలువయుపద్మనాభుఁడు గ • ణంబుల కెల్లనధీశ్వరుండు కా
వలెనని వేడ శంకరుఁడ • వార్యబలాఢ్యుగజాస్యునమ్మహా

జ్వలపదవిక్ వహింపఁగల • వాఁడని యందభిషిక్తుఁ జేసె ది
వ్యులు మనుజుల్ నిరంతరవి • భూతియుసౌఖ్యమునొంది వెల్గఁగన్ ॥

గీ॥ అట్టి గజముఖునిన్ను మే • మభినుతించు
వేళ చనుదెంచె నని ముదా • వేశమునను
శక్తికొలఁదిగఁ బూలన • ర్చన లొనర్పఁ
బూనితిమి చిత్తగింపు మో • పుణ్యచరిత ! ॥ 74

శ్రీభారద్వాజసగోత్ర భువనగిరికులపవిత్ర, కృష్ణాదక్షిణ
విభాసి గర్తపట్టణనివాసి, సుజనవరవిధేయ విజయ
రామనామధేయ ప్రణీత గణేశ్వరీయమందు
ప్రథమాశ్వాసము.

—:o:—



## ద్వితీయాశ్వాసము.

—:o:—

కం॥ శ్రీవేదాంతార్థ శుభ
ప్రావీణ్య నిదాన! పుణ్య • ఫల సువిధానా!
భావబలజనితసకల
ద్రావహావరదాన! విఘ్న • హారణాధీనా?॥

ఉ॥ నీకథ లెప్పుడున్ మదికి • నిర్మల సాత్త్వపదీనరాగ మో
దాకలితంబులై శ్రితజ • నాళిఘనస్తవ పాతక శుప్రితిన్.
జేకొని సర్వసమ్ముదముఁ • జేయును గాదె తదీయమాధురీ
పాకరసానుభూతులగు • వారి కృతార్థత నెన్న శక్యమే॥ 2

ఉ॥ పుట్టుకతోడనే యభవుఁ • బొమ్మని ధిక్కరణంబొనర్చు బల్
దిట్టవుఁగాఁగవుల్ కృతులఁ • దెల్పిరి బాల్యతనంపు ముద్దు లె
ప్పట్టునఁ జెల్లెనో తెలియఁ • బల్కిన వారలు లేరు మాకు నా
గుట్టు నెఱుంగఁగాఁ దగు సు • గోచరసాక్ష్యమెట్లైనఁ గల్గునే?॥

చం॥ కొలిచెడివారి చిత్తముల • కున్ సరిగాఁ దవనేకభావ లీ
లల నపుడప్డు తోఁచుటయె • లక్ష్యమొ? నీకలరూపెఱుంగ మా
యలవికి మించె నీదగు ని • రామయతత్త్వము నిర్వచింప ని
వ్వలఁగొనియెట్టివాఁడవయి • నన్ నుతిసల్పుటె కార్యమయ్యెడిన్।

మ॥ కలవో? యొందులనైనఁగల్గిన మనః • కాఠిన్యమున్ దాల్చి రా
దలఁపున్ బూనవొ? పూని మాదృశుల చి • త్తస్థైర్య దీక్షాపరీ

తుల బద్ధాత్ముఁడ వయ్యెదో? తెలియఁగ • నష్టంబయ్యె విఘ్నేశ! నీ
నెలవుల్ చూపునుఁ జూచుభాగ్య మదియు • న్నే? దేవ! మా
కెప్పుడేన్ ॥ 5

క॥ కల్పిత దైవమవో యని
యల్పాధిక సభలు జరిగె • నచటచ్చటఁ ద
జ్జల్పితములణంచి యశము
నిల్పికొనవె! భక్తతతుల • నెనరునఁ గనవే! ॥ 6

ఆ॥ వె॥ అల్లసాని పెద్ద • నార్యుండు నీపాల
నాటి చర్య కొంత • చాటినాఁడు
నిజమొ? కల్పితంబొ? • నీవయెఱుంగఁగా
వలయుఁ దెలుపఁదగిన • వారు లేరు॥ 7

క॥ బాలుఁడవై పుట్టితివో?
ధీలలితుఁడవై జనించి • తివో? నాకేలా?
లీలాగతి వాణీసతి
యేలీలస్ఫురింపఁ జేయు • నే నటులెంతున్॥ [రీశ నా

చ॥ మునులు సహస్రనాముఁడని • మోదమునన్ వచియింతు
రనకది మానమానొకో? స • హస్రసహస్రసహస్రనాముఁడం
చనిననుఁ దక్కువేయగు ని • యానుకవృత్తి మనంబదెట్టి చిం
తన యొనరించినన్ మదకు • తత్సకలంబుఁ దదర్పితంబగున్ ॥9

క॥ కావున బాల్యంబాదిగ
నేవిధమున నీదుకథల • నెఱిఁగి కొలిచి తా
రేవ నిటఁ దెల్పుకొందు ద
యావిలసితసుగుణగణవి • హర! గణేశా॥ 10

మ॥ జననంబంది ప్రపంచవస్తుగుణవి♦జ్ఞానంబుఁ గొంటాదిగాఁ
దనయుల్ శ్రద్ధయు మాద్దునింపెసఁగఁ బ్రో♦త్సాహించుచు
దల్లి సి
ఘనపర్వాప్తానుసందు నీభజనసం♦కల్పించి నీవిగ్రహం
బునుజూపించుచు నిన్నుఁగొల్చు కథఁదె♦ల్పున్ భక్తి ము
న్మందటన్ ॥ 11

శా॥ ధీమద్వీర నిరంతర గ్రసిత భ♦క్తిజ్ఞాన వైరాగ్య వి
ద్యామాహాత్మ్యనిధానమై తనరు త♦త్త్వాధ్యాపకత్వక్రియన్
నేమంబున్గొను తల్లి తత్కళలలో♦ నేదైన శ్రీభక్తి వి
ద్యామేయప్రభకున్ మొదల్ దెలుపు వి♦ఘ్నాధీశ! ని
న్నెంచ్చుటన్॥ 12

కం॥ ఆన్నా! విఘ్నంబులకున్
మన్నిడగుదేవుఁ గొలుచు♦ మంచి సమయ మా
సన్నం బయ్యెడునని సుతుఁ
దున్నతి పాఠములఁ దల్లి♦ తత్పరుఁ జేయున్॥ 13

ఉ॥ వేడుకకొంత తల్లికడుఁబ్రీతి♦నొసంగు ఫలాదులెందుఁబోఁ
గూడని కాంతుకొంత గమిఁ♦గూడి చరించెడి యీడుజోడులన్
జూడఁగ వీఁడె సూనురుకు♦ జోదనిపించు తలంపుకొంత వె
న్నాడఁగ నిన్నుఁబల్కు నుడు♦లన్నియు నేర్చెద రెల్లబాలకుల్॥

కం॥ ఎల్లివినాయక పర్వది
నోల్లాసంబనఁగ బాలు♦ సుత్సాహరసం
బెల్లెడ జల్లు గొనినగతి
వెల్లడి సేయుదురు వారి♦ వేడ్కలు సుదులన్॥ 15

మ॥ తనకుఁ బత్త్రియుఁ బుష్పముల్ దొరకునో • తత్కాం
డ్లకుఁ జిక్కునో
యను చిత్తంబున వేగుజామునఁనె ని • ద్రాదీనతన్ బాసి మ
జ్జనముల్ జేసి తదార్జనార్థము మహో • త్సాహంబుతో
నొక్కనిం
గొనకొక్కండ్లతిశీఘ్రమేగుదురనీ • కుఁ గూర్తు శ్రద్ధాత్ములై॥
శా॥ ఉత్కంఠన్ పటువుల్ దదన్యులును భ • క్త్యుద్రేకిత
స్వాంతులై
శీత్కారంబులనొందొరున్ దెగడుచున్ • శీఘ్రక్రియానైపుణో
దత్కాలంబున భూజసంతతుల కు • త్పాదింతు రుగ్రార్కభా
స్వత్కాఠిన్యమునన్ లభించుకళ స • త్పత్రాదికాకృంతనన్॥
కం॥ తమతమ కొలదులు గుఱిగా
సుమములు దళములును జేర్చి • సొగసు మెఱయఁగా
నెమలుల కోయిలలను మా
ర్గమునను కవ్వించుచుఁ గొనుచుఁ • గదలుదు రొకటన్॥ 18
గీ॥ గృహములనుఁ జేరి యట సోద • రీమతల్లు
లధికభక్తివినోద భ • రాత్మలగుచు
వలయుపనుల నిర్వర్తించు • పట్ల వారి
మ్రోలఁ బువ్వులగోలఁ దె • ల్పుదురు వరుస॥ 19
సీ॥ మేల్మిబంగరుసీట • మెదిపిరో యనహారి
ద్రాచూర్ణపంక మం • తట నలంది
తఱిపివెన్నెలచాలు • లుఱవుఁగా నిడిరినాఁ
దెలుపారుపిండి ము • గ్గులనుదీర్చి

కళలీను రతనముల్ • గట్టించిరో నాఁగఁ
కుంకుమాంకము లందుఁ • గూర్చి వ్రాసి
చుక్కలన్నియు నొక్క • చోఁ జేర్చినట్టుల
శ్వేతాక్షతల మధ్యఁ • బ్రీతి నిల్పి
గీ॥ దేవతాగారమున నొక్క • తిన్నెపైన
దశదిశలఁ గాంతి పుంజముల్ • దళుకుఁగొనఁగ
దివ్యపీఠంబు గౌరీశు • దిక్కునందుఁ
జేర్చుటలు గాంచి మోదమం • చెలఁగఁ బెరుగ॥ 20

సీ॥ నాన్నగారూ! చూపి • నాయకునకుఁ బాల
వెల్లి వేగంబె రా • వింపరారె!
,, ,, మంట
పంబు నిర్మింప శీ • ఘ్రంబె రారె!
,, ,, దోర
ణంబులఁ గూర్ప వై • ళంబె రారె!
,, ,, నలం
కారంబుఁ జేయ వే • గంబె రారె!
గీ॥ యనుచు బుడబుడ బడిఁబడి • యరిగి పిలిచి
తనకుఁ జెలిమైన తండ్రి పై • త్రనపువ్రేలుఁ
గొని ప్రబోధింతు రాత్మీయ • జనకు లెందు
నిలచియుండిన బుడుతలు • నెవరు గదుర॥ 21

ఉ॥ చిందులు ద్రొక్కుచున్ దనదు • చేతులదండ్రికరంబుఁ బూని ము

న్మందట సందశించు సుతు • ముద్దులమాటల నాలకించి యా
నందమునొంది కార్యగణ • నంబులమాని గణేశుపూజకున్
మందిరమున్ రచించుగరి • మంబునఁ దజ్జనకుండు వేడుకన్॥

వ॥ పీఠముంచిన ప్రదేశంబుఁ దరియఁజని॥ 23

గీ॥ నాల్గుమూలల కంబముల్ • నాటి నాల్గు
దెసల దట్టంపుటట్టల • నెసకమెసఁగ
ద్వారములఁగట్టి యునశశి • తారకాదు
లందు రంగుకాగితముల • నలరఁ జేసి॥ 24

ఉ॥ రంగుల కాగితంబులు హె • రంగు చెలంగఁగఁగత్తిరించి స
ర్వాంగములందు దివ్యము గు • నందముగన్పడ మంటపంబునం
దుంగయిసేసి యంచెలుగఁ • దోరణముల్ నెలకొల్పి భక్తిను
ప్పొంగఁగఁ జేయు నాకృతిన • పూర్వకృతిన్ సమకూర్ప
నెంచుచున్॥ 25

ఆ॥వె॥ ఉపరితలమునందు • నుజ్జ్వలగతిఁ బాల
వెల్లినిలిపి దాన • వ్రేలునటుల।
నందు నందు సుమఘ • లాదుల నూల్గ్రుల్పి
సుతుల సుతల మోద • యుతులఁ జేయు॥ 26

మ॥ కనువిందున్ బొనరించు మంటపము వే • డ్కన్ దాఁడ్రి
నిర్మింప ద
త్తనయల్ వత్తియు జందెముక్షతలు శ్రీ • ద్ధన్ గూర్ప నుం
డ్రంబులున్
దినుబండారము లన్నియున్ జనని భ • క్తిన్ జేయఁగా నీసమ
ర్చనఁగావింతు రిసమస్తబాలకసమా • జంబుల్ విలాసోద్గతిన్॥ 27

ఉ॥ ఆగతినేనునుజ్ దిరిగి • యా సుమంబులఁ గోసికూఁతులన్
దూగి పికాళులన్ గెలిచి తోడులతోఁజని తండ్రిఁ బిల్చినీ
కాగమభక్తిపీఠమిడి • యాందరివస్తువులుంచి పూజకున్
దాఁగుచు మూఁతలాడుఁ మది • ద్వారమునన్ మడినిల్చి
యుండినన్॥ 28

కం॥ నీరాకఁ దెలుపు కేకలు!
నీరూపముఁ దోపమోద నీరధిసౌఖ్య
స్ఫారవిలాసుఁడనై నిన్
జేర నెదురు నడచి మొ్రొక్కి చిత్తమెలర్పన్॥ 29

వ॥ సోదరాదులం గూడి భక్తిరసావేశితమనస్కుండనై
నిన్నుద్దేశించి॥ 30

కం॥ స్వాగతమో! గణనాయక!
స్వాగతమో! శ్రితజనేష్ట • వరదాయక! స
ర్వాగమతత్వద్యోతక
ధీగుణకార్యానుకూల • దివ్య! సుశీలా!॥ 31

గీ॥ నిండుకళవెండికొండ తమె • దండఁగలదా?
యెండవానమెండయి దారి • నెంతలసితో?
దండిగండఁడు తొలిఁదొలు • దుండగీడు
సొక్కి మదిసోల దానెంత • సొమ్మసిలెనో?॥ 32

ఉ॥ ఎన్నిదినంబులయ్యె నిను • నీగతిస్వాగతమిచ్చికాంచి నీ
యున్నెడఁజూచిచూచిమది• నుబ్బిటతబ్బిటలాడుచుంటిమో
యన్న! యెటులో మమున్ దలఁప • వైతివిజాగొనరించినాఁడవీ
పిన్నలమన్ననన్ మదినిఁ• బెట్టక పోయితటోయి మిత్రమా

ఉ॥ ఇప్పటికైన వచ్చితివి ♦ యే పదివేలిఁక లెమ్ము భోజనం
బెప్పుడు చేసితో జలము ♦ లెప్పుడు గ్రోలితివో! పథశ్రమన్
నెప్పుడె పుట్టెనో మెయిమ ♦ నోగతముల్ వెలిఁబుచ్చవేల నీ
యొప్పులవించురూపు మది ♦ నుంచిన తించుటనీ వెఱుంగవే॥

శా॥ తల్లీ! వేగజలంబుఁ బంపుమిటు శ్రీ ♦ ద్ధన్ విఘ్నరాజాంఘ్రిలన్
జల్లంగావలె శీఘ్రమైతనరు వ ♦ స్త్రంబిమ్మి యొత్తన్ వలెన్
మల్లెల్ గూర్చిన తాళవృంతమిటు తే ♦ మ్మా శ్రాంతికై వీవఁగా
నల్లంబం దఖిలాంగకంబుల సుగం ♦ ధోల్లేఖముల్ గూర్పఁగన్॥

కం॥ శ్రీగంధంబాదిమ్మిటు
వేగమె జందెమ్ముఁ దెమ్ము ♦ విరులసరాల సు
శ్రీగదుర వేయి నామము
లాగమవిధిఁ జదివి యితని ♦ నర్చింపవలెన్॥ 36

గీ॥ శ్రీగజానన! రజతాద్రి ♦ సేమమొగద!
పార్వతీపరమేశ్వరుల్ ♦ ప్రమథవీరు
లారు మొగముల తమ్ముండు ♦ నలకుబేరుఁ
డుచితసుఖవినోదంబుల ♦ నున్నవారె॥ 37

వ॥ అని మధుపర్కాదికంబుల నీకతిథిపూజ నొనర్చి దేవతాపీఠంబున నిన్సుఖాసీనుం జేసి.

గీ॥ పర్వదినమగు నేఁడు నీ ♦ పండువనుచుఁ
గనుల పండువగా నిన్నుఁ ♦ గాంతుమనుచు
నిన్నుఁ బూజింపఁ బత్రిమల్ ♦ నియతిఁ జేర్చి
సేవసల్పెద మోయయ్య! ♦ చిత్తగింపు॥ 39

కం॥ చేటలను మించుఁ జెవులును
వాటములగు చిన్నికనుల • పారబలఁబుల్
నీటును వెలయ దయ నిరా
ఘాటంబుగ మమ్ము సాకఁ • గదవె గణేశా!॥ 40

కం॥ త్రుటికాలమైన నిలువక
యటునిటు చలియించు తొండ • మాశ్చర్యము ము
చ్చటయును గనఁజేయుఁ సం
కట హారణా! దివ్య! సుప్ర • కాశ! గణేశా!॥ 41

కం॥ మానక మదజలధారలు
వానగఁ గురియంగ నళులు • పఱచి ముసరిరన్
దోనెభవత్కర్ణంబుల
బోనేయును పాపముడుపు • పోల్కి గణేశా?॥ 42

కం॥ రజతాద్రి సానువులలో
గజిబిజి యాటలనుఁ బొద్దుఁ • గడుపుచు నిట స
ర్వ జగద్రక్షణ కార్యము
విజయా! మఱువకుము సౌఖ్య • విధిని గణేశా!॥ 43

కం॥ మానససరోవరంబునఁ
బూనికఁ బొరలాడి తొండ • మునఁ దామరతూం
డ్లాని పెకలించి వేయుచు
మానితిఁ గానవే! యుదార • మతిని గణేశా?॥ 44

కం॥ ఏరీతి కార్యమేనియు
నారంభించుటకు మును పె • యతులితభక్తిన్

జేరి నినుఁబిల్చికొల్వని
ధీరుఁడు గలఁడొక్కొభువిని • దివిని గణేశా!॥ 45

కం॥ వినఁగదవే! నామనవులఁ
గనఁగదవే! దీనునన్ను • గరుణ నభయమం
చనఁ గదవే! నామ్రొక్కులఁ
గొనఁగదవే! ఘనత నిల్పి • కొనవె గణేశా!॥ 46

కం॥ పెద్దన్నకైతగారికి।ముద్దిడిపాల్గుడిచితొండ•మునవ్వలిచక్
బద్దుఁగొనసాచిపాపల।నద్దటిసర్దితివెతొండ్ల •టంచుగణేశా॥

కం॥ శరణాగతధరణీజన
భరణా! కరుణారసప్ర • వాహఘనాంతః
కరణా! విఘ్నాసురసం
హరణా! భవతరణతరుణ • మయ్యగణేశా॥ 48

లయభ్రమణము.

పరిపరివిధములఁ బ్రతిమాలికొనిన • బలుకవదే బిగితనమా?
వరరజతగిరిని వసియించెడిసుఖ • పరిచయమేయొకఘనమా?
కరికరచలనము గతిసీమనమును • కరిముఖనిల్కడఁగనదా?
సరిసరి యనుచరఁసమితిక్ గనెదను • సంసతబోఁ గనుగొఁ
నెదా?॥49

మత్త॥ శ్రీయుమాకరుణాప్రపుల్లవి • శేషదృక్పరిషేచితా!
కాయజారిమనోనుకూలసు • ఖప్రవర్తియశోధనా!
న్యాయశౌర్యవిధిప్రధానని • రంతరాభిరతాత్మకా!
గేయ!సుజనధ్యేయ! శ్రితపరి • కీర్తనీయమహాద్భుతా!॥

## మాలిని.

ఓమునిసేవితదివ్యపదాంబుజ! ♦ యోభువనత్రయభారవహా!
యో మహిమాంచితభవ్యచరిత్ర! మ ♦ హోజ్జ్వలకీర్తివిభాసహితా!
యోమణిరాజితహైమవిభూషిత! ♦ యోశ్రితసంఘమహార్తిహరా!
యోమహనీయ! గణేశ! నమోనమ ♦ యోరిమ నామనవిన్ వినవే॥

అలసగతి॥ కలవనెడి నమ్మకము ♦ కానఁబడ దెందున్
కలవొ మహిలేవొ పలు ♦ కన్ మనము డిందున్
కల వనుచు నమ్మినను ♦ గాంక్షభజియింతున్
సులలిత చరిత్రి! దయఁ ♦ జూడుమి గణేశా!॥ 52

నాగబంధచం॥

2 8 ౫ 5 6
సకలజనాయుతాకహార ♦ సారకృతిప్రనమణీయ వాగ్మహీం
3 8 1 ౧ 4
షకకవిధివిపాకగతి ♦ బ్రాతిగ నిన్నయపారభక్తి సే
7 ౨
తకు నయ సోక రాక తగ ♦ దా! గణభర్త! విభో! జయానిలా
౬ ౪
తికబరధామ! సోకుతిరిఁ ♦ దీరిచి మన్ను కళావిభాభరా!॥ 53

వరా—1, 2, 3, 4, 5, 6, 7, 8 =విజయరమయకవి

౧, ౨, ౩, ౪, ౫, ౬ = గణపతికృతి

సుగంధి॥ వారెవారు, కారు వీరె • వారు, కారు కారు వా
రీశ్వరు లే రటన్న గొప్ప • వేదబంబు సోకుటన్
ధీరయుక్తి నిన్నెరింగి • తీవ్రభక్తిఁ గొల్వఁగా
నేరమైతిమయ్య సైచి • నీ నిజంబుఁ దెల్పవే॥

మాలిని॥ విరుల సరుల బాగుల్ • వేడ్కఁ నొండొంటిపైనన్
గరము దొరయ నీయా • గారమున్ దిద్ది నవ్యం
బుదితపరమ భక్తిన్ • గొల్చెదన్ బూజ దేవా!
కరుణవెలయ మమ్మున్ • గావవే శ్రీగణేశా!॥ 55

లయవిభాతి॥ వెన్నెలల గున్నలనఁ జెన్నలరు క్రొన్ననలఁ
బన్నినసరుల్ రుచులఁ గన్నుల నలర్పన్
గొన్ని సుమగుచ్ఛముల సన్నుత పరీమళము
లెన్నఁ గప్పురపు ససికన్న నతిమాత్రిన్
మిన్నలయి మానసము నన్నుకొనఁజేయు సర
సోన్నతులఁ జిప్పిలు ర • సాన్నము ఫలాళిన్
మిన్నుదొరలాను సుధ • కన్నఁ గడు హాయినిడఁ
బన్నితిమి ప్రేమఁ గొనుమన్న! గణనాథా!॥ 56

క్రౌంచ॥ మూగెడి కామక్రోధ వికారం•బుల నుడుదుడుకులఁ
జొరఁగొని వేగం
బాగమసంద్యా! ప్రాకృతమాయా•వ్యథలణచి కరుణ
నరయఁగ రావే!
శ్రీగురురూపా! చిత్రకళాభా • సిత సకలభువన
శిఖరితకీర్తి!

శ్రీగణనాథా! చిన్మయరూపా! ♦ శ్రితజనసముదయ
చిరపరిసేవ్యా॥ 57

తరల॥ పొరుగువాఁడతిమాత్రమైనవి♦భూతిహాయిఁజెలంగెడున్
ధరణినాకిటు లేమిగల్గఁగ ♦ తంబదేమి యటంచు త
ద్దరణమందె చరించి జన్మ ని ♦ రర్థకం బొనరించెడిన్
నరుఁడనూయకులోగిశ్రీగణ♦నాథ! చెప్పెడిదేమిఁకన్॥

వసంతతిలకము॥ నాకంటె నెందునుగుణ♦ప్రియుఁడున్నెయంచున్
లోకంబు నెల్ల మది ♦ లోన నదల్చి గర్వ
వ్యాకంపితావ యపుఁ ♦ డై చెడు మానవుండో
లోకైకనాథ! గుణ ♦ లోలుప! గావునన్నున్ 59

ఉ॥ నాకెనురాఁడెదే? యనుచు; నామత మేమతమంచుమస్తుఁడై
లోకులతాఁచి ఆంపమున ♦ లోగఁగఁ జేయుచు రాజకీవి దు
ర్ధికుఁ డనుకుణంబుఁ దన ♦ ప్రేవఁజరించెడి మిత్రిఁగానఁడున్
నీకృపఁగాంచఁగోరఁ డవి ♦ నీతిపరుండయి విఘ్ననాయకా!॥

మత్త॥ మానవుండు జగంబు సర్వము ♦ మానుమ ప్రబలస్థితిన్
బూని, వృద్ధి నెసంగి, కాలము ♦ మూఁడినన్ జనుచుండుటల్
లోనెఱుంగఁ డెఱింగియున్ సుఖ ♦ లోలుఁడై స్మరియింపఁ డ
ద్దానలూన ఋజుప్రవర్తనఁ ♦ దద్దయున్ జెడుమీఁదటన్॥ 61

చం॥ తరువుల నీడ వాహినుల♦దాపునఁ బర్వత కందరంబులన్
దొరికిన లేశమాత్రఁ దన ♦ తోడులతో క్షుధవాపుకొంచు నెం
దఱు సుఖతృప్తిఁగాంచరువృ♦థాతృమఁదుచ్ఛఁడహీనసంపదో
ద్భరతుఁడెయయ్యుఁ బాపముల♦ బాల్పడు నాశలనోగణాధిపా!॥62

మానిని॥ ఆశల కొక్కెడ నిల్కడయేడ? న ♦ నంతములై యతి
మాత్రములై
పాశములై యభినూత్న ములై బహు♦భంగులమూఢజన ప్రతతిక౯
క్లేశునకు౯ బరమేశునకు౯ బెడ ♦ జేసి నిరంతర మాత్మకళా
నాశనము౯ బొనరించుతదు గ్రమ♦ణించిగణేశ! నను౯ గనవే?॥ 63
ఉ॥ కాంతికిఁ దూఁగి నల్లడలఁ ♦ గందువ పోకడ దూఁకి దీపికా
క్రాంతి గమించి తచ్ఛిఖలఁ ♦ గాలిన ఱెక్కలఁ గూలిచిత్తవి
భ్రాంతిఁ బిపీలికాక్రమణఁ ♦ బాల్పడు పుర్వనస్త్రివిలాసవి
క్రాంతికిలోఁగియాతనలఁ♦ గ్రందునరుండు గణేశ! మూర్ఖుడై॥ 64
తన్వి॥ ఘోరధనాశా కుటిలమనమున౯ ♦ గుర్వవిపుత్రకుఁడని
గనఁబోకే
వీరతనడ్డంబగు పెఱమనుజు౯ వేగమదూంచుటకయి ప్రియతించు౯
కూ్రరుఁడనార్యుం డగునరుఁ; డెవఁడు౯ ♦ గొంచుజనండొక
తృణమును వెంట౯
సారతరంబౌ నుపనిషదవని౯♦ పాకుమిః న్గణపతి! దయనూఱ౯
చం॥ ప్రతిఫల మింతగోరక ప్ర♦పంచమున౯ ♦ నిరతంబుధర్మసం
గతిఁజరియించు భాస్కరుని ♦ కంధరసంతతిఁ దేనెటీగల౯
సతతముఁజూచుచుండియును ♦ సత్పథము౯ వరియింపకుండుదు
ర్మతియిహలోకసౌఖ్యముమ ♦ రంగినరుండు గణేశ! మందుఁడై॥
ఉ॥ సృష్టిసమస్తమున్ దమకు, సేవ్యమటంచుఁదలంచిమానవుల్
గష్టము లొందువారిని సు ♦ ఖంబుననిల్పయతించుచు౯ మది౯
దుష్టి వహించిసేతకు బ ♦ దుల్ దలపోయక స్వీయకార్యము
తృష్ట మటంచు నెంచకచ ♦ రింపవలె౯ గద శ్రీగణేశ్వరా 67

చం॥ సుమముల తావులన్ వెతకు • చున్ విసువొందక నాడు నాటికిన్
విమలమధుద్రవంబుఁ దన • వీటనమర్చుచుఁ బెంపుఁజేసి పు
న్నమచనఁ దాఁగిన నౌననుచు • నమ్మి మధువ్రతశీలి నిల్వని
త్యముఁ దెఱిఁ వేచి తేనియను•హా! గ్రహియింపఁదలంతు రీ మానవుల్

ఉ॥ హాయవుపర్ణములన్ దముకు • బాసట గాఁ గరసంబులన్ మహా
పాయముగన్ గ్రహించి బహు • భంగులకొమ్మలు రెమ్మలాకులుం
గాయలుఁ బూచి కాచితరు • కాండములన్యహితాప్తినుండగా
మాయురె! మానవుల్ గరుణ • మాలి వెసన్ నరికింత్రు కూరులై

చం॥ అడవులఁ గొండలన్ గసవు • నాకలిఁదీఱఁగ మేసి నాగులన్
మడుగుల దప్పితీర్చుకొని • మాటున నెచ్చటనే వసించి యే
కుడుకొనరింపరాక పరితోషమునన్ జరి • యించు జీవులన్,
విడక వినోదమంచు పృథి • విన్ జనముల్ వధియింతురద్దిరా! 70

కం॥ కామము క్రోధము లోభము
వ్యామోహము మదము మత్స • రాధినతనాఁ
గా మలయు శత్రులార్వురు
నేమానిసి నైన నేర్చుఁటెడి నిజముకదా ॥ 71

చం॥ శమదమసత్యశౌచములు • శాస్త్రపరిశ్రమస త్తపంబును
త్తమగురు భక్తియధ్యయన • తత్పరభావము బ్రహ్మచర్యమున్
విమలబుజుప్రవర్తన ని • వేకమొసంగి శ్రుతార్తి సంఘమున్
మమతను బ్రోవవయ్య గణ • నాయక! శాత్రవమట్క మాఱఁగన్

* దండకము॥ *

మల్లెలున్ మొల్లలున్ మంచిసంపెంగలున్ బంతిచా
మంతులున్ బండిగుర్వెందలున్ జాజులున్ రోజులున్ జాపగే
దంగులున్ బూగపున్నాగములున్ బుష్పితాశోకముల్ బొన్నలున్
మున్నుగా నెన్నఁగా మిన్నలౌ చిత్రపుష్పాగముల్ జేరులై బారు
లై గుండ్రలై సోగలై సుదుసులై పొదరులై యర్ధచంద్రం
బులైయుంకలై వంకలై వరుసలై తలుచులై హాసుప్రులై
మురువులై పొల్పులన్ గొల్పుచున్ బొల్చి యువ్వెత్తుఁగాఁ
దావులం దెల్లెడన్ దావులం జల్లుచున్ వెండికొండన్ జగా
నిండుగా నుండఁగా నందునెత్తమ్మునం దుండి బల్ధారలా శంక
రశ్రీజటాజూటనిర్యన్మహాగాంగబిందుప్రచారప్రభూత ప్రవా
హంబులన్ బుట్టి నల్దిక్కులం బారి యాపూపుటీరంబులన్
జారుకాసారవారంబులై మీఱి సవ్వారి సవ్వారిగాఁ బద్మషండం
బులున్ గల్వతండంబులున్ సొంపుపెంపుల్ నివాళింప నగ్గిరి
కాననస్యసౌరభ్యతాపూర్తి నందందు చిందాడు సద్గాలికంపుల్
మనోహారసంచారముల్ మీఱఁబర్వంబులై సర్వజీవాళికిన్
గాత్రపర్వంబులై సౌఖ్యమున్ గూర్పనప్పర్వతోర్వీసముద్భూ
త భూజాళిపై నిధ్మసందోహముల్ జేర్చుచున్ గూడులన్
గట్టు నీడోద్భవాకుంచిత ధ్యానముల్, గొరిస్ననల్ మున్నెగ్రె
కొన్న గర్వంబునన్ మిన్నునంబారుపుల్గున్నికారంబునన్ దన్న
వెన్నంటి గగ్గోలుగాఁ బోరు పక్షీంద్రసందోహపుంఖానుపుంఖీ
భవత్సంకులారావముల్ దూరదూరంబునం దేరయం బొప్ప
నాహారముం దెచ్చువైహాయసోక్తుల్ జెవింబాఱఁ బోతంబు

లుత్కంఠమై నక్కలాయంబులఁ బిడిపోదూఁక యత్నించు
చుఁ దెక్కలల్లార్చుచుఁ జంచువుల్ జాపి సంతోషముప్పొం
గఁగాఁ జేయు నవ్యక్తమాధుర్యతాలాపముల్, గీరముల్ శారి
కల్ భూరుహాగ్రంబులఁ జేరి యొండొంటికిఁ మీఱ నుంకిచు
చుఁ సద్విజశ్రేష్ఠులిం దాగమస్వర్థ సిద్ధాంతముఁ బూర్వపక్షం
బసంగాఁబ్రదర్శిం చెడిఁ నాఁగ, నౌత్సుకముల్ రేఁగ జాపాడు
చర్చల్ పికం బోపిక గింశుకాశోక శాఖాగ్రములఁ నిల్చుచుఁ
సారెకుఁ దీటకఁ వార కుద్వృత్తిఁ గావించు కోకోయనాదం
బులంగూడి సంపూర్ణ రాగానులాపంబులై హాయిఁ జేకూర్ప
నకొండఁ బెన్గోనలఁ గానలఁ స్వేచ్ఛఁ బెల్లార్చు హర్యక్ష మ
త్తేభ శార్దూల ముఖ్యాఖిలారణ్యసత్వాళిమూర్చుల్ మృదంగా
దివాయిద్యమూపంబునఁ శ్రోత్రపర్వంబు నొందింప నందందు
బల్ చిత్రవర్ణంబులఁ జిత్రపక్షంబు లుద్రేకతఁ నాట్య మా
డంగఁ దత్తద్విశేషంబులం దింద్రియంబుల్ గ్రియా భావముఁ
బొంది నిస్తబ్ధతఁ జెంద సిద్ధిసుబుద్ధిసమేతుండవై మానసాంభో
విహారేచ్ఛకుఁ దోహదంబైన తద్గానవారాశిపర్వంబులఁ మైగ
గుర్వారఁగా హాళిఁగా లోకసంరక్షణాక్షీణదీక్షాభిదక్షంబులౌ
సీక్షణద్వంద్వనిర్వ్యద్దయావీక్షణంబుల్ దయాసత్యశౌచాది సద్ధ
ర్మ సంచారబద్ధాత్ములం దెప్పుడుఁ దివ్యసౌధాంబు సంచార
మై వారలఁ నిత్యసౌఖ్యప్రచారంబొనంగూర్చులోకంబులఁ
జేర్చుచుఁ దేర్చుచుఁ నైజసౌమ్యత్వ మాచాయఁ జూపించి
వేరొక్కచో దుష్టులై కామమోహాదిషడ్వర్గ మంత్రంబులఁ
యంత్రితాగంభులై యాంత్రిశూలంబనఁ బేర్చునయ్యాషణాత్రైక

సాభీలఘోరప్రయోగంబులన్ బద్ధజిజ్ఞాసువుల్ గాఁ బ్రవర్తించుచున్ మంచియున్ జెడ్డయున్ బుణ్యమున్ బాపమున్ బోల్చు నేర్పాదఁగాలేక ప్రారబ్ధకార్యానుకూలంబులై సత్పథంబైనను దుష్పథంబైనను గొంకులేకెన్నియో ఘోరకృత్యంబులన్ జేయు దుర్మార్గులన్ రాగవాధీనులుం గాఁగ నైజాతిరూక్షత్వమున్ జూపు నీశక్తియెన్నంగ మున్నెందఱో దేవతల్ రాక్షసుల్ మానవుల్ నాగు లేకేల యుష్మత్ప్రభావంబు భావంబునన్ గన్నవారెల్లరున్ బూని సంపూర్ణతన్ జూపరే దాసదాసానుదాసుండ నేనెంత నానేర్పుచేవిన్ నినున్ గొంతగీర్తించితిన్ దేవ! రావే! ననుం గావవే! గట్టురాపట్టిబల్ ముద్దుపట్టీ! జగజ్జెట్టి! కైలాసవాసా! గణేశా! నమస్తే పునస్తే నమః

కం॥ కొండంత దేవరకుఁగాఁ
గొండంతటి పత్రినొసఁగు • కోర్కియలవికిన్
మెండగు నేఁకొకపోఁగే
పిండగుగతి దలఁచికొనుమి • నీపీపూజన్॥ 74

గీ॥ ఎలుక మన్నినిపై స్వారి • సలుపువాఁడ!
కుడుము లుండ్రాళ్ళు మదిమెచ్చు • గుజ్జుతేఁడ!
కరుణ వరములొసంగెడు • కలిమికాఁడ!
చలువఁగలవాఁడ! మాగూర్చు • సంగడీఁడ!॥ 75

ఉ॥ మల్లెలో? మొల్లలో? మణులో? • మాలతులో? విరజాజులో?
రుచుల్
జల్లెడిమంచి సంపెఁగలో? • చల్లని పొన్నలో? కల్వలో? మరం

దోల్లసితాబ్జసంచయము • లో? నవకేతకులో? సతంబు నీ
యుల్లము నచ్చినట్టి పువ్వు • లో సుగుణాభరణా! గణాధిపా! ॥ 76

ఉ॥ ఏనుఁగుమోము వాఁడవని • యెబ్బెరికంపు నుడుల్ వచింత్రు నీ
మేనది యెట్టిదో తెలిసి • మెల్లనఁ జాలరు ముఁడ్లు బెండ్లు నీ
పై నిడుమంత్రము తెచ్చితేమి • పత్త్రిలఁ బెద్దలమాటఁ ద్రోయలే
కో నవనీతకోమలమ • హారోజ్జ్వలదేహ! యనుగ్రహింప వే॥ 77

శా॥ తీండ్రిల్ గల్గిన చిత్తముల్ విమలభ • క్తిన్ నిల్పి నిగ్గొల్చి సి
కుంద్రంబుల్ గడుఁ బ్రీతి యాలపిని గూ • నో? యుంచుఁ
జేయుంచిరో
తండ్రీ! నీదెస నుంచినారము దయా • తాత్పర్యతన్ జేరి మా
తండ్రిన్ బోలి పరిగ్రహింపఁగదె! భ • క్తప్రేమసార్థంబుఁగన్ ॥ 78

కం॥ ఆకొని యుంటివి నెమ్మదిఁ
గైకొనుమీ పాయసంబు • గారెలు బూరెల్
నీకయి మాయమ్మ యిడిన
యాకుడుములు మొదలు సకల • హితవస్తువులన్ 79

కం॥ మాయింటి యల్లుఁడవుగా
వో యయ్యా! నీకు నిచట • నోరు లెవ్వరు లే
రీయెడ వెనుదీయఁగ నే
లా! యఱిఁగి యారగింపు • మా దయమీఱన్॥ 80

కం॥ నిక్కపుమిత్త్రుఁడు మనపై
మక్కువగలవాఁడు బ్రోవ • మఱిగినవాఁడీ
ట్లక్కజ పడియెను నిప్పుడో
యక్కా! యొకపాట పాడు • నతని కొసంగవే॥ 81

ఉ॥ వక్కలుకప్పురంబులుల • వంగములుఁ మృగనాభియేలకుల్
జిక్కని గవ్వసున్నమును • జెన్నగు కుంకుమపువ్వు జాతులుఁ
జక్కనియాకులుఁ రుచుల • జానగు కొబ్బరిఁగూర్చి విడియం
బిక్కరుణాపరాత్మునకు • నీవలెతమ్ముఁడ తెమ్ముగొబ్బునఁ ॥82

ఆ॥ వె॥ పఱుపుఁ బఱచి శుభ్ర • వస్త్ర మూపై సాఁచి
తలగడయును మంచి • తాళవృంత
మనువుపఱచి పక్క • యామంచమం దుంచు
మమ్మ! సేదఁదేరు • నం దితండు॥ 83

కం॥ ఆయన శయనించినతఱి
నాయనఘు పాదసేవ • నందఱు భక్తిఁ
జేయుఁడు వేగమె యఘములఁ
బాయఁగవలె నవల నతని • వాగ్గుంభనలఁ॥ 84

కం॥ విసరెద పాదములొత్తెద
నసురుసురయి వచ్చినాడ • వంగములెల్లఁ
బసచెడెను నిదురఁగొనుమో
యసమానయశఃప్రభా • సహాయ! గణేశా!॥ 85

ఇది శ్రీ భారద్వాజసగోత్ర భువనగిరికుల
పవిత్ర కృష్ణాదక్షిణవిభాసి గర్తపట్టణ
నివాసి సుజనవరవిధేయ విజయ
రామ నామధేయ ప్రణీతం
బగు శ్రీగణేశ్వరీయమందు
ద్వితీయాశ్వాసము.

# —* శ్రీగణేశ్వరీయము *—

## తృతీయాశ్వాసము:

కం॥ శ్రీగిరిజామాహేశ్వర
వాగర్థద్యోతకప్రభాగర్భితకా
ర్యా! గౌరవసంభూచా
ర్యా! గుణమణిగణవిభాస హాయ! గణేశా ॥ 1

కం॥ అని వినియపై(బాడుడి
మనపూర్వభవంపు(బుణ్య మహిమ మనగృహం
బున కేతెంచె నితం డీ
యనుగ్రహము నిల్చువెరవు సరయుటమేలౌ ॥ 2

ఆ॥ వె॥ నిదుర లేచినాడు నీరముల్ గొనిరండు
పచ్చకప్పురంపు బలుకు లునిచి
పనుల నెల్ల వదలి భక్తి రండిటు మన
సంశయముల(దీర్చు సామి(తేడు ॥ 3

కం॥ అయ్యా! యవధానతమై
నియ్యెడ(జేరితిమి తెలియ కే మడిగెడుచో
నెయ్యము తియ్యనిపల్కుల
వియ్యము సేయంగ(దెల్పు వే కథ లెల్లన్ ॥ 4

గీ॥ పర్వముల దేవపూజలే ర్పరచు పెద్ద
లేలొకో? మానవైక హే త్వాళినుడువ

సకలశక్తిమంతుండగు శౌరి లోక
కర్మబంధజాలంబులఁ • గట్టువడు నె? ॥ 5

చం॥ సకలగణాధిపత్యమున • సాంబుఁడు నిన్నభిషిక్తుఁ జేయుటల్
ప్రకటితమై తదాది గురు • భక్తి నినుఁ దనియించి గాని యా
స్తికులు శుభంబు సేయమి ప్ర • సిద్ధపు కట్టడియయ్యె సేవక
పరికరనివేదితాఖిలము • భవ్యకృపన్ గొనుచుంటి వీవునున్॥ 6

ఉ॥ ఆమెయి నొక్కనాడు భువ • నాళుల భక్తపరంపరల్ గురు
స్వామివటంచు నెంచి తమ • శక్తికొలందిగ సేవఁ జేసి నీ
కామెతలీయఁ బ్రేమ నవి యన్నియుఁ గైకొని కోర్కెలిచ్చి నీ
గీమున కేగి శంకరుని • క్రేవను సాగిలి మ్రొక్కనెంచుచున్॥ 7

చం॥ హర! హర! యంచు బోరగిలి • నంతనె లంబమహోదరంబు చే
కరములు భూమి మోపినను • గాళ్ళు వియద్గతి నందఁ జూచి త
చ్చరణములన్ ధరన్ నిగుడఁ • జాపినఁ జేతులు పైకి లేవ ని
బ్బరమున దండవత్ప్రణతి • బాటిల నీవటనూగు చుండఁగన్॥ 8

కం॥ ఈనియత్నముఁ గని గౌ
రీనాధజటాపటోప • రిస్థితచంద్రుం
డాన విడి షోడశకళల్
బూని పెలుచ నవ్వెనంట • మోటుఁదనమునన్॥ 9

గీ॥ రాజదృష్టి విషావృష్టి
యోజఁదగుల నీదుకడుపుబ్బితప్తహ • నీయనోళ
మన పగిలెనంట యుండ్రంబు • లన్ని దెసల
బంతులనగంతులిడుచు వె • ల్వలికిదొరల॥ 10

ఉ॥ పార్వతిదానిఁ గన్గొనియుఁ బాయము వాటిలెఁ గార్యమేమి! యా!
యోర్వఁగలేని చందురుఁడ ♦ యోగ్యపుసేతనొనర్చినయ్యయో!
సర్వముఁ గూలినట్టుల వి ♦ షాదము పుట్టెమనంబు నందు నీ
దుర్విధి నాపవే శివ! వి ♦ ధుండట గర్వమడంగి కుందఁగన్ ॥ 11

చం॥ బ్రతుకునొ లేదొ పోఁడు పసి ♦ బాలకుఁడేయనుమాట లేకను
స్థితిఁ గనుచుంటిరే యిదియు ♦ చిత్రమె! వెక్కసమయ్యెనేమి నా
సుతుఁడిటు మీకు నాసవతి ♦ సుద్దులు మీతలకెక్కెనొక్కొ! హా!
అతిసుకుమారుఁడీతఁ డిటు ♦ లయ్యెనికేఁ గతియెట్టులోకదే॥ 12

గీ॥ అనుచు మీ తల్లి దురపిల్లి ♦ యడలుచుండ
నశ్వినీదేవతలచేత ♦ హారుఁడు నీదు
బొజ్జ నాగాళిఁ గట్టించి ♦ మోదమొసఁగె
నంట కుడుముల నీబొజ్జ ♦ నదిమిపెట్టి ॥

ఉ॥ శాంతి చెలంగ నీవల నె ♦ శాచగు మీదను క్రోధమూనిక
ల్పాంతక రోగ్రబాడబము ♦ హార్చులబోలెడు మిజ్ఞ్మరీచికల్
వింతగ వాని సత్కళల ♦ వీసము వీసముగా హరింప ను
త్క్రాంతదయుండవై తినట ♦ కల్వలమిందుఁడు కందికుందఁగన్ ॥

ఉ॥ అంతటఁ బోక రోషదహనార్చులఁ చిత్తము నందు రేఁగ సీ
గ్గింతయు లేక నీప్రనోక ♦ యెమ్మెలకాఁడ వటంచు నవ్వితే
కంతువిరోధియాదలస ♦ గంబొక ప్రాపయి నంతమాత్రనీ
కింతటి తుళ్లె గర్వమది యేద శపించెదఁ ♦ గాచికొమ్మికన్ ॥15

వ॥ అట్లు కోపోద్రేకంబున నీవను నప్పుడు॥ 16

శా॥ ఓహో హో! యేమనవచ్చు? దానవకమహా ♦ హుంకారకోపానల
వ్యాహారంబులకుల్కి "భో" యనుచు నత్యంతంబు వాపోవు చున్

నీహారోపమచిత్తయై శివజటా ♦ నీకంబులన్ గంగయు
త్సాహం బేదవడం గనాత్మజుఁడు ♦ యుత్సంగంబునన్ దోట్రిలన్ ॥

వ॥ అట్టియెడ నగ్గంగాపుత్రునుద్దేశించి॥ 81

ఉ॥ సిగ్గిలకేల నిచ్చెదవి ♦ సీకనరాదిఁక నీమొగంబునీ
మొగ్గున కెక్కు శిక్షయిది ♦ యేతగుఁబొమ్మిఁక మీదమూర్ఖతన్
బెగిలకే నినున్ గనిన ♦ వీరిడి కందును నిందు నెందునున్
లగ్గలఁగానఁతం డెపుడి ♦ లన్ గడు నిందలనొంది కుందుతన్॥ 19

కం॥ అనిశాపంబిచ్చితివట
వినిదానికి నడలి భీతి ♦ వెనుకొనువడకున్
గనిచంద్రుఁడు మొగమెటు చెల్లెనొ
నీదరిఁ జేరిస్తోత్ర ♦ లీలలనిన్నున్ ॥ 20

మ॥ కడుదీనుండయి వేడజాలిపడిరా ♦ కాచంద్రిమా! యేలఁద్రొ
క్కుచుఁ పాటొందెదవోడకోడకుముభ ♦ క్తుల్ నేడుపర్వంబుఁగాఁ
గడుభక్తిన్ బ్రతివత్సరంబునను సం ♦ కల్పించి పూజింపకే
జడులై నిన్ గన జెల్లు, శాపమతిని ♦ ష్కర్షన్ నన్నుఁ గిర్తించినన్ ॥21

శా॥ చంద్రాలోక నదోష ముండదనుచున్ ♦ శాపంపు కాఠిన్యమున్
సాంద్రంబున్ దయఁదేల్చి నాఁడవటవి ♦ శ్వాసంబు సద్భక్తియున్
రుంద్రంబాగతి గొల్చి భక్తులిల సి ♦ ద్ధోషత్వమున్ జెంది గౌ
రీంద్రైక్యంబున ముక్తులైరట నిజం ♦ బే? పార్వతీపుత్రకా! ॥22

చం॥ అదినిజమో యసత్యమొకొ ♦ యావలఁ దెల్పెదు లెమ్ము నీవటుల్
సదయుఁడవై యనుజ్ఞ నిడ ♦ సర్వజగత్పరిరంభశీలియా

ముదలయమోఘమై శశికి • మోదమొసంగఁగఁ బర్వమందునిం
జదివెడివారికోర్కు లిడి • సాకనుఁ జాలెనటందు శ్రీవరుల్॥ 23

కం॥ ఆపర్వము భాద్రపద
శ్రీపుణ్యచతుర్థి యనుచుఁ జెప్పుదురు బుధుల్
ద్వాపరమున నినుమరచి ని
శాపతిఁ గని నిందనొందె • శౌరియు నహహా!॥ 24

వ॥ అయ్యాది పెద్దలవలన నెఱింగిన తెఱంగున విన్నవిం
చెద నవధరింపుము॥ 25

కం॥ శ్రీకరమై సంపదలకు
నాకరమైవర్ణవిధిహి • తాచారకళా।
నీకాను రాగజనకౌ
భాకరమై ద్వారకాఖ్య • పట్టణ మలరున్॥ 26

ఉ॥ కట్టని కోటయై సిరుల • కల్పకమైవర కామధేనువై
చెట్టలఁ దోలు సాధబహు • శీకరకోమల గంధవాహమై
పుట్టుకఁ దొట్టివీరయదు • పుంగవధీబలరక్ష దేలు న
ప్పట్టణ మొప్పు శౌర్యవిభ • వప్రతిపాదకమై శుభాంకమై 27

వ॥ అందు॥

సీ॥ ఆద్యంతశూన్యుఁడై • యఖిలమూర్తులకుఁ దా,
నాదియై వెలుఁగొందు • సతఁడితండె
శేషాహిశయ్యల • క్ష్మీమనశ్చోరుఁడై
యలలను య్యాలలూఁగు • సతఁడితండె
భక్తియోగాధీన • భవ్యాత్ముఁడైసదా
శ్రితజనంబులనోము • సతఁ డితండె

దుష్టనిగ్రహమహా • శిష్టసుస్థిరుఁడై ద
శావతారములొందు • నతఁడితండె
గీ॥ యనుచుఁ బదునాల్గు భువనంబు • లందు వెలయు
వారినుతియింప సంపద్వి • హారియగుచు
బలునితోఁగూడి యదువంశ • భవ్యుఁడలరఁ
గృష్ణుఁడలరుక్మిణీభామ కెలనఁగొలువ ॥ 29

మ॥ ఒకనాఁడందొక పూవుఁదోఁటమణిచి • త్రోద్యన్మహాసౌధభా
షికమౌ చంద్రశిలాతలంబున విపం • చీనాదసాయుజ్య దీ
పకతన్ రుక్మిణిశోభిత పర్వమొనరిం • పన్ గాడ్పుకుట్టిందు వే
డుకనల్లలన వీచియాడఁ బుర్రఁబో • తుల్ జేరి సేవింపఁగన్ ॥ 30

కం॥ ఎలదోఁట పూబెడంగుల
సలలిత సంగీత సరస • సౌఖ్యంబులన్
పులకాంకిత తనుఁడై హరి
వెలసి వినోదాబ్ధినీదు • వేడుక నుండన్ ॥ 31

ఉ॥ తమ్ములనాటి కూర్మముల • దాటియనంటుల పోఁకిసైకతా
భమ్ములఁ దూఁకిసారసశు • భప్రతిభన్ మును కెత్తి కొండనె
త్తమ్ములమీటికృష్ణుకను • దమ్ములచూపుహత్తాద్గతిన్ రుచుల్
జిమ్మెడు మిణ్గురన్ వెలుఁగు • చెంతవసించెఁగ తన్ స్థిరంబుఁగన్ ॥

చం॥ మిణుకుమిణుక్కునన్ దిరుగు • మిణ్గురు పుర్వునఁదోఁచి మింటివ
ర్తనమును వీడురిక్కయనఁ • దప్పని కాంతిఁ జెలంగి శుక్రుఁడో
వనజజుఁడో యినుండో యనఁ • భాస్వరమై తదనేకకోటివ
ర్ధనతనుదగ్రమై వెలయు • తద్ఘనకాంతి నిమీలితాక్షుఁడై ॥

కం॥ తనవారలు దిగ్భ్రమతోఁ
గానినోలని దేమి వెల్గో • కోయనుచిత్తం
బునఁగొంతనిల్చి తుదకుఁ
గనెసత్రాజిన్మణిప్ర • కాశంబనుచుఁ॥ 34

కం॥ అంతఁ జెంతల, పట్టణ
మంతట నివసించువార • లద్భుతరస వి
భ్రాంతులయి మంతనంబులు
గంతులిడఁ గృష్ణుదెసకు • గదలిరి గుములై॥ 35

శా॥ఓయీ! మాధవ! మెచ్చుటఁ సలిచితే • యోగ్య వేగ రావేల? నీ
చాయఁ మిక్కుటమైన కాంతి సకలా • శాభేదముల్ గప్పిమా
కేయూహల్ బొడసూపనీదకటరా • వేభోగ్యవ వేమమ్మ ని
ష్ఠాయుద్యానము పోవు నెందు? విడవ • య్యా కేళియుఁ బాళియుఁ॥

సీ॥ కంటిమయ్యా! వియ • ద్గంగాప్రవాహంబు
ధరణి కవతరించు • సరణిదోఁప
గంటిమయ్యా! తటి • ద్ఘనకాంతి పుంజముల్
స్థిరయుక్తిధరఁ జేరు • సరళిదోఁప
గంటిమయ్యా! చంద్ర • కాంతి సహస్రముల్
సరిమీటి ధరఁ జేరు • సరణిదోఁప
గంటిమయ్యా! ప్రభా • కరకోటి తేజముల్
జతఁగూడి ధర జేరు • సరణిదోఁప

గీ॥ మింటి చుక్కలన్నియు నన్ని • మిత్రమండ
లమ్ములంద్రవి యిటుచేరి • గ్రుమ్మరెడినొ

యాకసంబను తెరఁజిమ్మ • నవలనుండు
చండతరదివ్యసత్ప్రభా • జాలమే మొ॥ 37

మ॥ కనుమీ! దీనినిజంబు నారయుమిమా • కస్త్రీని వారింపుమీ
యినుఁడో! పావకుఁడో! మహేంద్రుఁడొకో! వా • ణీశుండో యీశుండొకో
ఘనమాయాపరుఁడై నరక్కసుఁడో! లో • కధ్వంసకృద్భూతమో
యనుమానించెద వేల? నొచ్చెదము కృ • ష్ణా! సుంత జాగైనచోఁ॥ 38

తే॥ గీ॥ అనుచు నంధుల క్రియ ద్రిమ్మ • లాడువారి
మొఱలాలించి యభయంపు • ముదల యొసఁగి
యతఁడు సత్రాజియంచు నా • యద్భుతంపు
వెలుఁగురవిదత్తమణి దంచు • దెలియఁబలికి॥ 39

ఉ॥ వారల భీతి • వాపి ధృతి • వంతులఁ జేసి యదూద్వహుండు దు
ర్వారమణీమరీచికల • రమ్యత కద్భుత మందుచుండఁ ద
ద్గౌరవకాంతిఁ దన్నొక య • ఖండమణీమయ విగ్రహంబటం
చూరక చూపరుల్ గన య • థోచితవృత్తిఁ దదంతికస్థలిన్ 40

వ॥ చేరి, సత్రాజిత్తను వాఁడు, తనసూర్యోపాసనాక్రమంబును, కృపాళుఁడై నభోమణి తన కయ్యనర్ఘ్యమణి నొసంగుటయుఁ, బ్రతిదినంబు నధికతరమగు హేమంబుఁగురియు తన్మణిప్రభావంబును, తత్పూజాప్రయుక్తంబగు రాజ్యంబు నిరామయాది సౌఖ్యంబులఁ జెలంగఁ గల్గుటయు మొదలుగాఁగల సర్వవిషయంబులు నమ్ముకుందునకున్ వినిపించిన నగ్గోపాలుండబ్భూపాలుని యద్వితీయ సూర్యోపాస్తి నగ్గింపుచు నమ్మణిం

బడింబడిఁ గనుంగొనుచు యాదవ విభుండగు నుగ్రసేనుకొఱ కద్దానిం బడయువాఁడై సత్రాజిత్తు నడిగిననందుల కాతండియ్య కొనండయ్యె. అది యట్టిదకాదె? పవలనక రేలనక, గ్రీష్మ వర్షాది ఋతుధర్మంబులకుం జలింపక, తదేకనిష్ఠ ననేకవత్సరం బులు కడుంగడు శ్రమింపడి గడించిన యర్థంబు విడువనెట్టి జడదారికైన మనస్కరించునా! అంతట సముచిత ప్రకారం బులనా సత్రాజిత్తునపి, యథేచ్ఛా విహారంబుల నారుక్మిణీ మనోహరుండు విహరించుచుండె. అట్లు సత్రాజిత్తు ముకుం దునివీడ్కొని నిజవాసంబుకరిగిదినకరోపదిష్టమార్గంబున నమ్మణి నర్చించుచు సంపన్నుండై సుఖంబుండె. అంత నొక్కనాఁడాతని తమ్ముండగు ప్రసేనుండు కౌతుకావేశితమానసుండై యమ్మ ణినఱుతందాల్చిమృగయావినోదభరంబుమెయినాట వికసమూ హంబులం దవిలి మహాజవసత్వయుతంబగునశ్వరాజంబు నధిగ మించి తదధికతరవేగంబునం దోడివారలవీడి మహారణ్యమధ్యం బున నరుగుచుండ దేదీప్యమానంబుగ నాతని కంఠంబు దాపు నం బ్రకాశించు నమ్మణింగని యపూర్వ కళావిశేషం బగు నామిషంబను తలంపున నొక్కహర్యక్షంబు గుభాలునఁ బొద లమాటునఁ బొంచి యాప్రసేనుపయిం దుమికి యశ్వసమేతు నాతనింబొరిఁగొని యమ్మణిం బంటనిరికించుకొని యెందేనరు గుచుండె. అక్కాలంబునఁ దదంతికంబున విహరించుచుండిన జాంబవంతుఁ డమ్మృగరాజంబు దెసంబరికించి తదాస్యంబున నత్యంత తేజోమయంబగు వెల్గునమిఱుమిట్లుఁగొల్పు నమ్మణిం గాంచి తనపుత్త్రికకుం గేళీకందుకంబుఁగ నుపయోగించు నను

తలంపున నక్కసరి నోపరిలంజేసి యమ్మణిం గొంపోయి తన కుమారుని తొట్టియయందుం గందుకంబుగ వ్రేలాడంగట్టి యునిచె. అమ్మణియు దైనందినసమారాధనంబు గుడిపోవున కతంబున సువర్ణంబుగుఱియు టుడిగి తొల్లిటికాంతి యంతయుం దఱుగఁ గేవలామూల్య మణివడుపున దర్శనీయంబై యుండె నంతనచ్చటఁ బ్రసేనుజాడఁ గానక యాతని హరిహరియించుట చూచాయగ నెఱింగి యయ్యది యదుప్రవరుని కృత్యంబుగం దలపోసి ప్రసేనుఁడేగిన నాడనందనందనుండును వేటసాటించుట నిరూపించుకొని చింతాక్రాంత హృదంతరుండై సత్రాజిత్తు మనంబున నిట్లని వితర్కించె॥

శా॥ అన్నా! యెన్నఁడు వెన్నుఁడన్న బొమా • త్రైలోక్యస్వభా
వుండుఁగా
నెన్నం జొచ్చితి నిట్టిఘాతుకుఁడుగా • హీనుండుఁగా నాత్మలో
మున్నే తోఁపక పోయె ఘోరతరమా • మోసంబు వాటిల్లెఁ జెం
తన్నాదిక్కవ రాతఁ డెట్టిపనికై • నట్ బూను వాఁడేకదా 42

శా॥ ఏమే! మానసమా! దురూహగొనెదా • యీశప్రభుం
డార్యుఁడు
ద్దాముక్రూరమహాసురాంతకుఁడు భ • క్తస్వాంతసంవాసి, య
స్తోమన్యాయ పథంబు వీడ, హరి యా • తోఁవక జక్ గల్గునే
నామందప్రథ, నాదుపూర్వకృతియే • నాకీగతుల్ దెచ్చెఁబో॥

కం॥ నాజీవితంపు ఫలముక్
నా జీవనదాత నాకు • నాకెప్పు సుఖముక్

నాజవము బలము నామణి
నాజయముఁ బోయెఁబోవు • నాప్రాణంబుల్॥ 43

వ॥ అని వగచు నెడ॥ 44

కం॥ అనుజుని బలవత్స్మృతిలో
నెనసిన శోకంబు చిత్త • మెరియింపఁ దపో
ఘనతఁ దినమణి యొసఁగిన
మణిపోఁ గాతని మనంబు • మఱియుం గలఁచెన్॥ 45

తే॥ గీ॥ అపగతస్థైర్యుఁడై యాతఁ డంత నింతఁ
బ్రచురపఱుపంగసాగె న • వ్వార్త వీట
వింటిరే ధర్మపరులార • వీతధర్ముఁ
డగుమురారిచేసినట్టి కా • ర్యంపుటగడు॥

సీ॥ పంచేంద్రియసుఖాను • భవముజ్జగించు త
దైశ్వర్యనాబద్ధ • పాల్గొఱుఁగఁడొ
కష్టతరావాప్త • గౌరవఫలవియోగము
జీవనిర్బంధ • కముగఁ గనఁడొ
అర్చితంబై సమ • స్తారోగ్యము లొసంగు
మణి గొప్పఁదన మొప్పు • మంచి లేదొ
తత్ప్రభావప్రాప్త • ధనధాన్యసంయుతా
స్మచ్ఛోభఁ జూచి స • న్మతిని గొనఁడొ॥ 47

తే॥ గీ॥ పరధనాపహారంబును • బరజనాస
బరపదుర్మార్గకృత్యము లంచు • నరయలేఁడొ
యతని ధర్మసంస్థాపన • మిది యొకొక్క
ద్వారకాభవ్యనగరవా • స్తవ్యులార॥ 48

తే॥ గీ॥ అనుచు దొంతర దొంతర • లంచెలంచె
లగుచు నుప్పొంగు శోకశో • కాభిహతులఁ
దిటములదర మనోగతిఁ • గాళ్ళు తొట్రు
పడఁగ హరిఁ జేరి యిట్లని • పలికె నతఁడు॥ 49

తే॥ గీ॥ మాటవరుస నానాఁడు నా • మణి నడిగితి
వనుచుఁ దలఁచితిఁ గాని నీ • మనసు లోన
నింతకుట్రు వహించె దం • చెఱుఁగనైతి
బేలనైతి సహోదరుఁ • గోలుపోతి॥ 50

శా॥ ఏమీ! నీబుజువర్తనం బిదియె? నా • కీనాఁటికిన్ దోఁచెనీ
వేమో ధర్మపరాయణుండవని నే • నిందాఁకఁ గైకొంటి ఛీ!
నీమోమున్ గనరాదు దొంగవయిమా • ణిక్యంబుకై వేచి మా
నామానంబులు వీడి నాయనుజుఁ బ్రా • ణాంతంబు నొందించితే॥

మ॥ మణిపైనంతటిమోహమున్న యెడన • స్మద్బాహుముక్తారిమా
రణకృద్బాణపరంపరల్ సయిచిపో • రన్ గెల్చి గైకోక దు
ర్గుణమున్ జూపి యశక్తదుర్జనత సం • కోచింప వైతీవు నీ
గుణమున్ మాపెద రమ్ము మామకమహా • కోదండకాండార్భటిన్

శా॥ అస్మద్ఘోరతపఃఫలంబుమణినీ • యాస్యంబునన్ బూడ్చియా
సుస్మేరాస్యు మదీయ సోదరు ననిన్ ద్రుక్కించితీవేళ ని
న్నస్మత్తీవ్రశిలీముఖప్రచయకా • లాగ్నిప్రభాకీలలన్
భస్మీభూతు నొనర్చకే విడువ శుం • భద్భండనప్రౌఢిమన్ ॥ 53

కం॥ అని శోకరోషసంభ్రమ
మున సత్రాజిత్తుపలుకు • ములుకుంగమి పో

లిననా క్తతులఁ వినియుఁ
మనశ్చలనమింత లేక ♦ మాధవుఁడుండెఁ॥ 54

కం॥ ముదుపలిసత్రాజిత్తు
ల్లెదుటఁ గాల్ద్రొవ్వుచుంట ♦ నెనసెదు నవ్వుఁ
వదనమునఁ దోఁచి త్రోపని
చదురున మాధవుఁడుబల్కె ♦ సౌమ్యవచనముల్॥ 55

కం॥ మామా! యొకమణికై నే
నీమాదిరిఁ జేయుదనుచు ♦ నెటులెంచితివీ
వీమాటలనఁగనీనో
రేమాడ్కఁ వచ్చెఁదెల్పు ♦ వే స్థిరబుద్ధిఁ॥

తే ఆశమంతకమాణిక్య ♦ మటుతఁ దాల్చి 56
దివ్యతరశోభ నీ వరు ♦ దెంచునాడు
గాక మన కిద్దఱకును త ♦ ద్గాథ మరలఁ
గ న్గొనేఁలోన నీమాత్రి ♦ దలఁపవలదె॥ 57

కం॥ ఎన్నఁడొనవ్వులమాటకు
ని న్నా మాణిక్యమడుగ ♦ నేయడిగితిఁబో!
నన్నంతమాత్రిఁ దన్ని
ష్పన్నమతి నటంచు నిట్లు ♦ పన్నెద చెప్పుమా॥ 57

తే॥ గీ॥ అంత నంత నీనానుడి ♦ యెరుగుదేర
నిన్నె యాకత మడుగంగ ♦ నెన్ని యుంటి
యానుభవము బెద్దతనము నీ ♦ కధిక మెకద
యిట్టి యుపనింద నాపయి ♦ నెట్టులిడితి॥ 58

కం॥ అనిపల్కు కృష్ణు సౌమ్యవ
చనములకు నసహ్యఁబడుచు • సత్రాజిత్తి
ల్లనియెఁ దమ్మునిఁ జంపియుఁ
గనుమూసెదె? నాదుమణినిఁ • గాఁజేయుటకున్॥ 95

శా॥ అబ్బో! నీబులి బుచ్చికంబులును సా • మ్యాలాపముల్ మాయలున్
మబ్బుల్ నాకడనా వచించెద వినీ! • మర్యాదపోషామ్మునీ
డబ్బున్ దబ్బులకుల్కి నివ్విదుజడుం • డా కాదు ఫీఁ దూరకే
తబ్బిబ్బాడెద వేల? శౌర్యధనుసత్రాజిత్తు మున్నుండదటన్ ॥60

శా॥ ఏదీ! మోమిటు త్రిప్పిచూడు మట నీ • వేకావె? ధర్మైకమ
ర్యాదన్ బో నిడి మాప్రసేనుని మహా • రణ్యంబునన్ ద్రుంచి క్ర
వ్యాదప్రకియఁ గొంటిమానికము మి • థ్యావాదముల్ చేయుచున్
గాదన్నన్ జనఁగల్గునే? ప్రబలసా • క్ష్యంబున్న దుష్కార్యముల్

గీ॥ ఏదురాలోచనయు లేని • యెడలమాప్ర
సేనుఁడేగినదిశ మె యూ • కానలోన
యేల! పొంచితి? వేటకిం • కేయరణ్య
మైన లేదొకో వెడమాట • లాడెదేల॥ 62

ఉ॥ వేటరు లెందరో పలుకు • విశ్వసనీయములై చెలంగునా
మాటలు మిథ్యలై ఋజువు • మాలిన నీ కథ నిల్చునేమి నీ
యాటలు సాగి రా విచట • నట్టిటుఁ బల్కితొలంగ నెంతెము
మ్మాటికి నిన్ను వీడి! చను • మందుఁడు గాఁడితఁ డంచు నమ్మమా

కం॥ అనుచున్ బల్కెడుచో బలుఁ
డును సాత్యకి యతనిపైఁ గ • దున్ రభసమునన్

జను చుండ నిలిపి యందరు
వినఁ గృష్ణుఁడు బల్కె నతిగ • భీరరసోక్తుల్॥ 63

చం॥ మగుసలి, తమ్ముఁడాన్న, మణి • పోకయు వీనిఁ గలంపఁ బోలు, ని
య్యదన బురాకృతానుగత • మైయపనింద ఘటిల్లెనాకు, న
య్యది చను నే వృథా యితని • నంకిలిఁ బెట్టిన యంతమాత్ర, సం
పదల ముదంబు నాపదల • వంతయు ధీరగుణంబు లే భువిన్॥64

తే॥ గీ॥ గండ్రితనమున నితనినిఁ • గాదటన్న
బలసమేతు లెంతటికైనఁ • బాల్పడుదు ర
టన్న జగముసడిన్ మాన్చు • టెన్న దెట్లు
కర్మ కనుగుణముగఁ జెలం • గవలెఁగాక॥ 65

కం॥ కానఁ బ్రసేనుఁడు గూలిన
కాననమున కిపుడ పోవఁ • గా వలె రథముల్
బూని కొని రమ్ము దారక
పూనిక నెరవేర్చి నిందఁ • బో ద్రోతు నిఁకన్॥ 66

వ॥ అని సత్రాజిత్తుం గనుంగొని 67

కం॥ నాయెడఁ గని కార్యమునకు
నీ యగడిది యేమి యనెడి • వృత్తి మనం బ
ట్లాయితమొనర్పఁ బల్కితి
న్యాయము వెలిఁ గనదె యొక్క • నాటికి నైనన్॥ 68

తే॥ గీ॥ లేని యపనింద నాపయిఁ • బూని తనుచు
నించు కంతయు వగవ నా • కిదియు నొక్క

దుష్టు శిక్షింపఁ బురిగొల్పు త్రోవయయ్యె
నతులసంతోషవారాశి • యమరుటయ్యె॥ 69

తే॥ గీ॥ నీశమంతక మెచ్చట • నిలిచి యున్న
నెమకి నెలలోనఁ దెచ్చెద • నిశ్చయముగ
సకలభువనరాజన్యాగ్రి • శౌర్యవహ్ని
యెదిరె నేనియు నెమ్మది • యెసక మెసఁగ॥ 70

కం॥ మామాఁ • చింతిలఁ బోకుమి
నామాట యథార్థ మనుచు • నమ్ముమి తునకుఁ
నామంచికి యేబహుమతి
నేమించెదో యెన్నకొనుమి • నిశ్చలబుద్ధిన్॥ 71

చం॥ అనిరథమెక్కి వెన్వెనుక • నా ప్రభటుల్ జను దేర వేటరుల్
వినిచినత్రోవ, కృష్ణుఁడతివేగత • నేగఁ దదీయవృత్తి మం
తనము న కద్భుతం బగుడు • దథ్య మసత్యము నేర్పరించు చిం
తనమదిఁ బ్రామగాక్లెటులఁ • దన్గొని నాఁడెసకున్ జరించు మున్
ము॥ బలరామాను వారివాక్యతతులన్ • బాటింప కేమిన్ను భూ
తలమున్ జూచుచు దీర్ఘయోచనల స • త్రాజిత్తుఁడిల్సేరి ధీ
బలవత్త్వాత్రివ సిద్ధినొక్కటిత్రిటి సం • పాదించి తదోష్యానునం
గల నింకెట్టులటంచునొక్కతఱిఁజింతన్ బొందు వేరొక్కచోన్
శా॥ ఏమో ! నిక్క మెఱుంగ నెట్టులగు ని • ట్లేకాదెలోక్యాగ్రధీ
స్వాముల్ జూపెడు నాటకంబుగతిపి • శ్యాసార్థ మెట్లౌను నా
నోముల్ బంట మనంబు తాల్మిమణిన • న్నుం జెందినంగాక యి
ట్లేమాటాడిన నేను లాభముగు కా • నిమ్మెట్లు గానున్న దో॥ 76

కం॥ అని యప్పటి శోక సమ్మతిఁ
గొనినను ధృతి నిలక ♦ పాలకుండను గర్వం
బెనసెడు వృత్తికి లోనై
కనడాతని మనము స్థిరత ♦ గాసంతియునన్ 77

చం॥ క్రమముగఁ జింతనంబనెడు ♦ కాకజనింపఁగఁ బేరియున్న శో
కము ఘనరోషముల్ బొరలుఁ ♦ గాఁ దెగి జాల్వడి నీరునీరుఁగా
నమర వినూత్నవైఖరుల ♦ నాతని మానస మావరించె శు
ద్ధమతరవైరసిద్ధియెడఁ ♦ దప్పసభీతి సుఖత్వహేతివై॥ 78

కం॥ పినతండ్రి యసురుఁ డాయుట
మణి పోవుట తండ్రిదిన ♦ మతివై కృశతన్
గనుటయుఁ గృష్ణుఁడు విపినం
బున కేగుట యెఱిఁగి సత్య ♦ మూర్ఛిలు మదిలోన్॥ 79

క॥ వగచుచు, ధృతి జనకునికిన్
వెఱపడచుచు నలయు దెసల ♦ వడసిన గతులన్
దగ జరియించియు, హరితోఁ
బగ యన నలుకెత్తి వడకు భావము గదురన్॥ 80

చ॥ జనకుని యెట్టులేపియును ♦ సన్మతి నొందఁగఁ జేసి మన్మనః
ప్రణతులకున్ ఫలంబు గన ♦ వచ్చు నొకప్పటికైన నంచు జీ
వనభరము జ్జగించకొని ♦ వచ్చితి, డింపుకకంన్ల యానసాఁ
దనరునో? దైవమా! మనోహి ♦ తక్రియ మాం దెసనిట్టు లయ్యెనే 81

వ॥ కేవలైహికలౌకికసంబంధబద్ధమానసుం డగు మజ్జ
నకుండు॥ 82

మ॥ మునుపే, గోపకు లేడ, సర్వజనసం ♦ పూజ్యావనీనాథస
త్తనయాసంఘము లేడ, నెండొరులబాం ♦ ధవ్యంబిసీ చెల్లునే
యనకీ పిల్లతనంపుపొల్లులిఁకని ♦ త్యాహార్యధైర్యాదిస
ద్గుణుఁడౌచున్ శతధన్వియుండననిన ♦ న్గోపించుచుండున్ గదా॥
ఉ॥ దానికిఁదోడు వైరమిట ♦ దాసరమయ్యె నిదేమిరుక్మిణీ
జానికి నాదు తండ్రికిని, ♦ శక్యమె నాజనకున్ నయింప నా
మానసచోరుఁ దెల్పఁదర ♦ మా?, కరమున్ భరమయ్యెజీవనం
బే నియతిన్ వహింపఁగల ♦ నెద్ది యుపాయము దోపదక్కటా!
ఉ॥ తమ్ముఁడుపోయినన్ సరియె ♦ దైవత దత్తశమంతకాఖ్యర
త్నమ్మునుఁ బోయినన్ సరియె ♦ తాల్మి వహించి యుపేంద్రు బూర్వవృ
త్తమ్మును నాకుఁ గానరసి ♦ తావక దుఃఖమైన మానె న
న్నిమ్మని యందునా! జనకు ♦ నేత్రరసర్వమెఱింగియుండియున్
తే॥ గీ॥ తమ్ముఁ బోరిఁగొని దివ్యర ♦ త్నమ్ముఁ గొనియె
వధ్యుఁడీకృష్ణుఁ డనెడి భా ♦ వమున నున్న
జనకు మది యేవిధంబున ♦ సమ్మతించు
నామనోనాథుఁడగు వాని ♦ నన్నుఁ గూర్ప॥ 86
మ॥ మణిపైఁదమ్మునిపైనిరూఢమగు ప్రే♦మన్ గాంచఁగా లేదు మ
జ్జనకుం డంతియగాక శౌరి సకల ♦ జ్యావ్యంతరప్రాణిసం
జననప్రాభవ మారకక్రియల ని ♦ చ్ఛామాత్రసంపాసి దా
మణికై యిట్లొనరించు నేఁ ప్రబలసం ♦ పద్వ్యక్తుఁడై యుండియున్
మ॥ జనకుండొప్పక యున్న మానెననుఁద్వాం ♦ త్సంబద్ధచిత్తన్ దయన్
గొని పొమ్మంచును రుక్మిణీసతివలెన్ ♦ గోపాలు బ్రార్థింతునో

యననుతాఁ హాసురాదు చిత్తమునహో! • హో! నిందలన్ గొల్పువా
రినిమన్నింతురె యెట్టిజ్ఞానులును సం • ప్రీతాత్మభూమిస్థలిన్ ॥ 88

ఉ॥ ఎట్టిముహూర్తమందుదివ • సేశ్వరుమజ్జనకుండుమానిమై
గట్టితపంబునన్ గొలువఁ • గాసమకట్టెనో; యెట్టివేళనా
వెట్టలవేల్పు ప్రీతుఁడయి • వేడినయర్థమొసంగె నొక్కొ యా
కట్టెఁడిమానికంబు గృహ • గర్భమునెత్తటిఁ జొచ్చెనో గదా 89

కం॥ అమ్మా! మోమాణిక్యమ
సమ్మతి నహరహము నిన్ను • శ్రద్ధాభక్తిన్
ముమ్మరముగ సేవించుట
కెమ్మాదిరి ఫలముఁగోరి • యే? యిది సరియే?॥ 90

కం॥ పినతండ్రిఁ జంపితివి నా
జనకుని చిత్తంపు బిగువు • సడలించితి నా
యినునకుఁ బాపితి నన్నో
మణి! మాదెస నీకు నొక్క • మంచియు వలదే! 91

శా॥ ఆహా! మానికమా! భవద్వికటకృత్యం బంతముం జెందదే
స్వాహోపాశ్రిన మీను మిక్కిలిగఁ గృ • ష్ణస్వామిపై రేఁగి వి
దాశ్రిహారచ్యుతుఁ జేసి ఘోరవిపిన • వ్యాపారముల్ గూర్చితే
వ్వోహో! పాపము! మోహమా! విరసమా • యూహింప
రాకుండెడిన్ 92

తే॥ గీ॥ దినకరా! కర్మసాక్షివై • దినదినంబుఁ
దిరుగు నీకైనఁ దెలియదే • పరమభక్తి
మణిసమారాధన మొనర్చు • మాప్రసక్తి
యిట్టి యగచాట్ల కెయ్యది • హేతువయ్యె?॥ 33

కం॥ తపనుండ వగుట నీమణి
కుపదేశ మొనర్చితే? శ్రుతోగ్రత, దినముల్
విపదబ్ధి మునుఁగు చుండియు
విపత్కలన యందు నీవు ♦ వేడుకఁ గానెదే?॥ 94

శా॥ ఏలా; మిత్త్రిని యిట్లు దూరజనకా♦భీష్టప్రదుండా ఘనుం
డే లాభంబున కీర్తియన్ వెలఁగు నా ♦ హింపంగ మాణిక్యమే
లా లగ్గిక తోలంగు దివ్యమది? నా ♦ ప్రారబ్ధమే యిట్లునన్
లూలామాలముఁ జేయఁ బోలుఁదాలి నేలోపంబు సంధిల్లెనో?

కం॥ అను భావోద్రేకంబునఁ
గను లశ్రుజలప్రపూర్తిఁ ♦ గను టనిలగతిన్
గోని నీట నించు కించుక
మునిగిన యళిసహితపద్మ ♦ ము లన వెలింగెన్॥ 96

తే॥ గీ॥ ఓ! శమంతకరత్నమా! ♦ యో! దినేశ!
నన్ను శ్రీకృష్ణుఁ గూర్చు పు ♦ ణ్యముసఁ బొందు
నాదు లోపంబు లేరి యె ♦ న్నకుడు మీకుఁ
దవిలి యర్పింతు భక్తి వం ♦ దనశతంబు॥ 97

మ॥ అనుచున్ దీనత నిస్పృహన్ మునిఁగి స ♦ త్యాతన్వి శ్రీకృష్ణుపైఁ
దనకున్ గల్గిన చిత్తవృత్తి మణివృ ♦ త్తాంతంబు నస్వస్థుఁడై
జనకుం డుండు టరణ్యసీమలకుఁ గృ♦ష్ణస్వామియున్ బోవుటల్
మనమందొక్కటి వెంటనొక్కటిగస ♦ మ్మర్దంబుగాఁ దోచుటన్॥

ఉ॥ ఉన్నటులుండి యశ్రుజల♦మూరిన చోటనె డించె, గాలివాఁ
దిన్నఁగ లేచు పద్మముగ ♦ తిన్ గను లల్లనఁ దేఱఁ దేటియున్

జెన్ను వహించె వాయుహతిఁ • జేడ్పడి గిట్టలఁ దేటి గుచ్చినన్
బన్నిడి వర్ణభేదమన • భావపరిక్రమ వేగ మద్ది రా!॥ 99

సీ॥ అఱమోడ్పు కన్దోయి • యంతంత విడఁ బాఱె,
తరుణాగ్నిహోత్రశా • తరుచిఁ దాల్చె
స్ఫుటితనాసాద్వంద్వ • ఘూత్కారముల నార్చి,
ధూమంబు చదలఁ దో • డ్తోన నెగసె
ముకుళత్కరయుగంబు • మొనసియొ య్యొయ్యన,
సంబద్ధముష్టి పీ • ఠంబు బూనె
సిరింసన్మనోదార్ఢ్య • సంజాతకంపావి,
నిర్ముక్తమై మేను • నిట్ట నిగిడె

తే॥ గీ॥ నచలతానూర్చిఁ గనులకు • నంద మొసఁగు
భ్రూవిలతయు నల్ల నల్లనఁ • బొదువఁ బడియె
నేరిపై నెట్టి వాక్బాణ • ధార పఱుపనొ
యనఁగ నాసత్యభామ క • య్యవసరమున॥ 100

శా॥ ఔనౌ నాశతధన్వ కార్య మిది లే • దావంత సందేహ మా
రా నాపై వలపూని మార్గనక నా • కత్యంత ప్రేమాస్పదుం
డైనా చిత్తముఁ గొన్న వానిని మణి • వ్యాజంబునన్ గానన
ధ్యానాత్మున్ బొనరించె నింక నెది చే • యన్ బూని యున్నాఁడొకో!॥ 101

శా॥ ఓరోరీ! శతధన్వి ధైర్యయుతశౌ • ర్యోద్యోగముల్ బూనలే
కీరీతిన్ గుటిలోక్తిఁ దావకమనో • భీష్టంబు సాధింపఁగా

నారంభించితె? యర్ధహీన మదియే • లా? కాల్పనే? పేరుమ
త్స్ఫురో ద్యద్ఘన కాండ చండిమ భవ • త్ప్రాణంబులన్
గ్రోలఁదే॥ 102

ఉ॥ తుంచెదనా? భవచ్ఛిరము•దుర్బలజాతుఁడ వీవటంచు మ
న్నించెదనా? భవద్వికట • నీచకృతిన్ సకలం బెఱుంగఁగాఁ
బొంచెదనా? సమస్తజన • మోహనుఁ గృష్ణుఁగనన్ వనంబుగా
లించెదనా? వరించుట ఫ • లించి మనోహరుఁ డాత్మమెచ్చఁగన్

చ॥ అదె చెలులందఱున్ గుసుమ• హారములున్ విరజాజిబంతులున్
బ్రిదిలుఫలంబులున్ రుచులఁ • బెంపగు తేనియలుం గ్రహించిన
చ్చెదరిఁక వైళమేగి దృఢ • చిత్తమునన్ జగదంబకున్ శుభ
ప్రదకును బూజచేసియటు • పైఁదగుమార్గము నిర్ణయించెదన్॥

కం॥ తీరిక గలవేళలఁ గో
నీరీతిఁ దలంచుకొనుచు • నింతయు మదికిన్
దీరిక నొసఁగన్నేరక
వారక శ్రీ సత్యభామ • వందురు చుండెన్॥ 105

గద్య

ఇది శ్రీ భారద్వాజసగోత్ర భువనగిరికుల
పవిత్ర కృష్ణాదక్షిణవిభాసి గర్తపట్టణ
నివాసి సుజనవరవిధేయ విజయ
రామ నామధేయ ప్రణీతం
బగు శ్రీగణేశ్వరీయమందు
తృతీయాశ్వాసము.

# —* శ్రీగణేశ్వరీయము *—

## చతుర్థాశ్వాసము.

కం॥ శ్రీరజతాద్రి నికేతన
నారదముఖదివ్యనుతస ♦ నాతన ! శౌర్య
స్ఫారజిత విఘ్నయాతన ।
ధీరా! భక్తార్తిహారణ ♦ ధీ! విఘ్నేశా!॥ 1

వ॥ అవధరింపుము॥ 2

ఉ॥ అక్కడఁ గృష్ణుఁడట్లుచని ♦ యాదిఁ బ్రసేనునిఁ దత్తురంగమున్
జిక్కిన సింగమున్ గుహాకుఁ ♦ జేరిన భల్లుకపాద చిహ్నముల్
జక్కఁగఁ జూచి వేటరుల ♦ సమ్మతిఁ దద్గుహాముందు నిల్పి తా
నొక్కఁడుఁ దానిలో నరిగె ♦ నూర్పులు డించి కడంకనల్లనన్

కం॥ ఇది జాంబవంతు గుహానన్
సదమలమతిఁ గోరెనతఁడు ♦ సమర మొనర్పన్
మది మెచ్చి వల్లె యంటిని
గద శ్రీరామావతార ♦ కార్యాంతమునన్॥ 4

కం॥ ఆవర మిప్పుడతీర్పం ।
గా వలె శాంతాత్ముఁ డితఁడు ♦ గావున మాయా
ప్రావిర్భావంబునఁ గ్రో
ధావిల మానసు నొనర్చి ♦ దరిఁ జేర్పఁ దగున్॥ 5

వ॥ అని నిశ్చయించుకొనుచు నగ్గుహాబిలంబుం జొచ్చి

శా॥ పోవం బోవ మహాంధకారమయమై • పుంజీభవత్కజ్జల
ప్రావారావేష్టితమైన యట్లమరి నే • త్రద్వంద్వ మున్మీలితం
బై వీనుల్ గడుజిక్కన్ గుహాభయ • వ్యామోహాజంబైన లో
నావం దేని కలంక లేక చనె లో • సాధ్యుండు గంభీరుఁడై ॥ 7

చం॥ చనఁగఁ జనంగ ముందొకట • సన్నని తెల్లని వెల్గు లీలగా
గనుపడ నాదెసన్ నడువఁ • గాఁ బ్రిబిలంబయి కొంతదవ్వునన్
ఘనసమతాతలంబు పొకటి • కన్నుల పండువొనర్చెనందు చ
క్కని తరువుల్ సుమావళి సు • ఖంబొనఁగూర్చుచు నుండెఁ
బెల్లుగన్ ॥ 8

వ॥ అందొక సౌదరింటి దాపున మణిమయాందో
ళికాంతరంబున సుప్తుండగు నొక్కకుమారుండును తత్క్రీ
డార్థంబందుగట్టిన శ్యమంతకంబును తదంతికంబున వింత
వింతపాటలం బాడుచుండిన నొక్కపరిచారికం గాంచి యాశ్చర్య
మగ్నమానసుండై యున్నంత

ఉ॥ అబ్బురమేమిచెప్ప మణి • నంతకునంతకు గాంతిపుంజముల్
బ్రిబ్బి పరిక్రమించి బహు • భంగుల దిక్తతిఁ బ్రోకసాగెనా
గుబ్బుగ సర్వభూభువన • గూఢమహాకలుషాపహారులౌ
నబ్బలరామసోదరుసు • ధాతిపవిత్రపరీక్ష సోకుటన్ 10

చం॥ బుడుతఁడునంత లేచి తనముందఱఁ బైనసియాడుచుండియా
యుడుపతి రీతి వెన్నెలలమోఘముగా బరపించు సన్మణిన్

బుసుకు చులాగుచుఁ గనుచుం • ముచ్చటలాడఁ దొడంగె దాసియా
పెడ నివసించి తత్సుఖముఁ • బ్రీతియుఁ జుబ్బనచూడఁ గైకొనన్ 11
ఉ॥ అంతయుఁ జూచి కృష్ణుఁడిది యామణియా నొకఁ డాయసుదత్సభా
భ్యంతరవర్తియై యడుగు • నందడుగేయుచు నల్లనన్ దదీ
యాంతికచారి యైనఁ గని • యబ్రము భీతి పెనంగు నెల్లునన్
జింతిలదక్క దాసియటు • చెన్ వడిదొంగయటంచు బిట్టుగన్ 12
శా॥ ఆయాక్రందనమాలకించి కుపితుం • డై జాంబవంతుం "డహో
హో యేసిందు జెలంగ మీకగు భయం • బొక్కింతయున్ లేదు భు
క్తాయుర్దాయుఁ డుగాక వేఱొకఁడు డా • యన్ గల్గునే మద్గుహన్
నాయాదార్యము దప్పవానికి శర • ణ్యంబొండు లేదిద్ధరన్"
చం॥ అను చుసరాల్ సరాలునను • హాంతరమున్ ద్యజియించి దూఁకుచున్
గనియె నిజాగ్రమందు నవి • కంపితగాత్రు విశాలవక్షు స
న్మణిగతవక్షు మధ్యపరి • ణద్ధమహోజ్జ్వలబాహు దీర్ఘకా
యుని సుకళావిలాసితుని • నొక్కరు నంచితధైర్య సాహనిన్ 14
వ॥ కని క్రోధోద్రేకితభయదాట్టహాసవిజృంభితశరీరుండై యా
భల్లుకేంద్రుం డా యదువల్లభు నధిక్షేపించుచు నిట్లనియె. 15
కం॥ తుంబవా! నీముఖ చిహ్నం
బులు నీ కార్యమున కెదురు • మొగ్గడి నీ క్రము
చ్చులదారి యంతమగుని
దులనించుక యెదిరి నిల్వ • దొడగితి వేనిన్ 16
మ॥ పరిపంథిప్రబలాపలేపసుశక • శ్రీభ్యాసనవప్రోథదు
ర్భరగంభీరతరాస్మదీయభుజశౌం • భచ్చౌర్యకేళావళిన్

దరమే ప్రమగ్గి నశింప కేగి బ్రతుకన్ ♦ దాస్యదృగ్జనానీకముల్
శరణో త్రాహియని వేడకుండిననిరున్ ♦ స్వర్గస్థుగావించెదన్ 17
చం॥ నను నొక చీరికిన్ గొనక ♦ నామణికై గనుచుంటి వేమి! మ
ద్ఘనతరశౌర్యగర్జనల ♦ గాఢవిభీషణతన్ రుచించె దే
యనుచల జాంబవంతుఁడు మ ♦ హాదృఢముష్టియుగంబుతో
గుభా
లున హరి చెంతకున్ నడిచె ♦ లోకభయావహ పాదఘట్టనన్ 18
వ॥ అంతం గృష్ణుండు సంరంభసంభావితారంభుండై,
చం॥ నిలునిలు మోరి మూర్ఖమణి ♦ నీయదియెట్లగు తస్క
రుండవై
కులుకుచు నింటఁ బెట్టికొని ♦ కూర్చుని నంతనె చెల్లునే యుసీ!
యులుకుచు బీరముల్ బలుక ♦ నూడని బాడఁగ నిందు భీరువుల్
గలరొకో నిన్ను మించితగుఁ ♦ గాదన కేటికి వేగిరింపఁగన్ ॥20
కం॥ ఇమ్మణి సత్రాజిత్తున
కిమ్ముగ సూర్యుం డొసంగె ♦ నీతని తమ్ముం
డమ్మాణిక్యముతో నిట
గ్రిమ్మరి హర్యక్షునిహతిఁ ♦ గూలెన్ మణితోన్ ॥ 21
కం॥ ఆసింగము మణితోఁ జను
చో సంహారం బొనర్చి ♦ సుతు తొట్టియలో
భాసిలఁ గట్టితివీవట
నాసత్రాజిత్తుదీని ♦ నరయక వెలుచన్ ॥ 22
కం॥ మును పేనడుగుట యొకకా
రణముగ నూహించి తనదు ♦ భ్రాంతిను వనినే

నణచి మణి దొంగిలించితి
నని నాపయి నిందఁ గొలిపె • నతఁడే మందున్ 23

కం॥ దోసము నామెడ లేమికి
నీసాక్ష్యమెచాలు నాకు • నిర్మలహృది నీ
వేసకల మెంచి గురుధ
ర్మాసక్తిఁ జరింతువేని • నదినాకిమ్మా॥ 24

కం॥ ఈకతక్కిన నిన్ మదహీనశౌర్య
పాశబద్ధునిఁ జేసి ప్రా • భవముఁ మీఱ
నీవు గనుచుండ మణిఁగొని పోవువాఁడ
బుద్ధిగలదే నొనర్పుమీ • ముదలవేగ॥ 25

కం॥ ఏవంవిధగంభీరర
సావృతవాఙ్మయతి యాద • వాన్వయచంద్రుం
డావిష్కృతసత్వంబునఁ
గా వచియించుటయు భల్లు • కవరుం డలుకన్॥ 26

కం॥ కటతట పటపట రటరట
గటముల్ గోపాతిరేక • గతిఁ బిట్టదరన్
ద్రుటితాఖిలమర్యాదా
ర్భటుఁడై యరుణాంబకోగ్ర • భటుఁడై పలికెన్॥ 27

శా॥ ఛీఛీ మూఁయుము నోరు నన్నెవరిఁగా • జింతించితో రోరి
నీచా చాలించుమి తావకాంధ్యజయదృ • చ్ఛాకల్పనం బింకపై
నాచంద్రార్కయశోగ పర్ణపూర్ణరఘురా • మాధీశ సేనాముఖో
ర్వ్యచండాంశుడ నంచు నన్నెఱుగవో • రీ తస్కరా శ్రీసరా! 28

చం॥ ఘననిబిడాంధకారగురు • కాననసంచయసంవృతంబు దు
ర్జనమదహారిశౌర్యవిభ • వ ప్రతిభాసువిభాసితంబు పా
వనరఘురామపాదరజ • భంగతరంగితమంగళంబు మ
ద్ఘనభుజరక్షితం బిది జ • గంబుననొండ్లకు దూరశక్యమే॥ 29

కం॥ అట్టి గుహాభ్యంతరమును
మెట్టియుదుర్నీతి నీవు • మేను దొలంగకే
యట్టిట్టు మిట్టి పడియెదు
మట్టెద నిను కాల గాచి • మడియింతు నికే॥ 30

ఉ॥ పౌరుషలబ్ధమై తనరు • వస్తువదెట్టిది యైన బాహుశౌ
ర్యారభటిన్ దొడంగి యనయంబును రక్ష యొనర్తు శూరు లీ
నీరసవాక్తతుల్ వినరు • నిష్ఠురముష్టిగదా ప్రహారసం
హారమె త్వాదృశావళికి • సంతిమ మైన జవాబు సుమ్ములన్॥

కం॥ నీముదల యుండ నిమ్మటు
నీమున్నలఁ గాచికొమ్ము • నిర్ఘాతశత
పాత్రమాణ్యనిష్ఠురం బిదె నాముష్టి
యటంచు నంద • నందను దెసకున్॥ 32

ఉ॥ చేరినరన్ మెఱుంగు వలె శీఘ్రగతి నోరనడన్ దొలంగి స
త్త్వావధి శౌరి దక్షిణక • రాగ్రమునన్ బకు దండ చేయిఁ జా
లాఘవున బట్టి పిప్పు కన • లన్ దన వామ కరంబు నూదుచున్
లేవఁగ నెత్తి త్రోసె నవ • లీల నరిన్ వసుధాస్థలిన్ బడన్॥33

ఆ॥ వె॥ అటుల భల్లుకేంద్రు • నవనిపైఁ బడవైచి
యచలితాత్ముఁ గృష్ణుఁ • డంత నిల్చి

సజలజలద గర్భ • సంజాతగర్జాగ
భీరనాద మెసఁగ • నిట్టు లనియె॥ 34

శా॥ ఓహో భల్లుకరాజ! నిష్ఫలతమో • ద్యోగంబునం దేల నీ
బాహాప్రోద్ధత వమ్మొనర్చెదవు శౌం • భద్వీర్యభేదంబు నీ
యూహల్ దోఁచదె యిందుఁ, గాన బహు • ధాయోజించి మాణిక్యముల్
నాహస్తంబున నుంచి ప్రోవుడిగి చిం • తల్ దీరి జీవింపుమా॥

కం॥ నీవలె బహుభాషిత్వము
నా వాక్కునకనంగఁ బోదు • నమ్ముము మొదలన్
నేవచియించిన గతి మణి
నీవొసఁగనయేని కొందు • నేనది కలనన్॥ 36

ఉ॥ మాటలసడ్డ జేసి క్షణ మాత్రమునన్ ధర వీడి లేచి ప్రాం
తాటవికాగముల్ బెరికి • యారుణనేత్రశిఖావళుల్ నిరా
ఘాటమహాగ్నిహోత్రివిశి • ఖ్రుపబలాగ్ర్యుల నందు రేఁప న
య్యాటవికుండు శౌరి హృద • యంబున దానిని రువ్వె
రువ్వెనన్॥ 3

శా॥ ఆహా! యేమనవచ్చు సత్వగుణవా • హ్యాళిన్ జగానిల్చు న
మ్మోహాతీతు హృదంతిమస్థలికిఁ బోఁ • బోవంగఁ దద్వృక్షశా
ఖాహారజ్వలితాగ్ని తచ్ఛమదమా • ద్యాంభఃకణాపూర్తి స
న్నాహం బేది తొలంగె శౌరి గుణాని • న్యాసంబు లెంతెంతలే

కం॥ శ్రీకృష్ణ జాంబవంతుల
కాకయ్య మటంట మిథ్య • యది సత్వతమః

ప్రకట ఘన యుద్ధము నా
భీకరమై యంత కంత • పెరిగెన్ వడిగన్॥ 38

గీ॥ సత్వమా! తామసమ! గెల్వఁ • జాలు నధిక
శక్తి గల యది యనెడు సం • శయము దొలఁగఁ
బద్మసంభవుఁ డీద్వంద్వ • భండనంబు
లోకహితబుద్ధిఁ గూర్చె నొ • కోర్కెఁ గడంగి॥ 39

ఉ॥ శాంతము నెప్పుడున్ విడక • శాంతి సహాస్త్రపదప్రచారమా
వంతయుఁ గన్నులన్ దొలఁగ • నట్లు మెలంగి పరప్రహారముల్
జెంతలఁ దప్పిపోఁ బెడకుఁ • జెంగున దూఁకుచుఁ గాలపాశమూ
ర్ధ్వంతిమ బాహువీర్యమున • నాహరి మల్లకళాప్రవీణుఁడై॥ 40

చం॥ మెలఁకువ సంచరింప, బలి • మిన్ నరుఁ డొక్కఁడ సంగ
నెంత యం
చెలుఁగుల తేఁడు నీరసపు • టెన్నికతోఁ డ నలక్ష్యవృత్తి మున్
మెలఁగి యనంతరంబున న • మేయబలప్రతిభాఢ్యుఁగా హరిన్
దెలిసి కడిందిపూన్కిఁ దన • దేహము జృంభితమై వెలుంగఁగన్॥

గీ॥ దండతాడితభుజగేంద్రు • చండిమంబు
భండనపటిష్ఠతయు మహో • ద్దండ బాహు
దండతాండవపాండిత్య • దక్షతయును
మెండుగుచునుండ జాంబవం • తుండు పోరె॥ 42

వ॥ ఇట్లతి భీకరంబుగ బ్రహ్మాండంబు లొండొంటిం డీకొనిన వడుపున నయ్యాదవ భల్లుకేంద్రు లన్యోన్యాతిక్రమ శౌచ్ఛలంబోరు సమయంబున జాంబవత్పరిక్లుప్తవసుధాస్థితు

లయిన వృక్షరాజంబు లాకసంబున సజీవంబులై పరతెంచె
డినో యన నొప్పె నప్పుడు॥ 43

క॥ పడునవి పఱచునవి • యుఁగేల్
విడి పడి నేగునవి కృష్ణు • విగత మగుడఁన్
దొడఁగునవి మింట డీకొని
దడదడ తునియునవి యయ్యెఁ • దరుబృందంబుల్॥ 44

క॥ తరువుల శిలలన్ దృగ్గో
చరసంగర యోగ్యవస్తు • చయముల నెల్లన్
బిరుతివక పోరి పదపడి
సరోషమున మల్లయుద్ధ • చాతురి మెఱయన్॥ 45

ఉ॥ బండొరు చేతులన్ నలఁపు • చుగ్రత నున్నటులుండి శా
త్రివున్
దండిబలంబు ఘోరముగ • ధారుణిపైఁ బడలాగుచున్ మహో
ద్దండత మధ్యమూని వసు • ధాస్థలిఁ ద్రోయుచు లేచిరోషమా
ర్తాండనిభాకృతుల్ గొని స • రాలున బాటునుబోరి రుద్ధతిన్॥

సీ॥ వంగుచున్ లేచుచు • వలగొని తిరుగుచు
డాయుచు గురుకుమ్ము • టంబు లనఁగ
హాస్తంబు లంసంబు • లందుంచి యందంద
డీకొంచు దండి పో • ట్లలు లనఁగ
బడఁగొట్టి పైకొని • పడి పెనంగుచు రోజు
లెగయ ఘోరభుజంగ • మేందులనఁగ
వడివడిన్ బిడికిటఁ • బొడుచుచు నెగయుచు
బొంచి దూఁకుచు వ్యాఘ్ర • మూర్తులనఁగ

గీ॥ రక్తపాతవివర్ధిత • రౌద్రిముద్ర
నరుణిమాపూర్ణసకలదే • హంగు లగుచు
చండకరమండలద్వంద్వ • చండిమోగ్ర
భండనప్రౌఢిఁబోరి రు • ద్దండగరిమ॥ 47

కం॥ అలసిన నిలచుచు నలసట
తొలఁగిన బిబ్బిడి బలంబు • తోఁ గలయుచు సం
ధులు గలఁగ మెలిగొనుచు ను
జ్జ్వలగతిఁ దలపడుచుఁ బోర • సాగి రిరువురున్॥ 48

కం॥ గడియలు జాములు దినములు
వడివడిఁ జనుచుండె నారి • భండనమునకున్
గడ తోఁకదాయె రోషము
లుడుగక పెలుగంగఁ జొచ్చె • నుగ్రము లగుచున్॥ 49

ఉ॥ భల్లుకరాణివాసము ప్ర • భంజనకంపితసాగరంబు నాఁ
దల్లడమందసాగె నుదు • తల్లజ నాజ్ఞ గుహాముఖస్థులౌ
గొల్లలు వేటకుల్ గుములు • గూడిహారిన్ మృతుఁగాఁ దలం
చుచున్
వెళ్ళిరి దుఃఖితాత్ముల స • వేగముగాఁ దమయిండ్లు సేరఁగన్

ఉ॥ ఆచ్చట భల్లుకేంద్రుసతి • యాత్మజయున్ సఖురాండ్రు
యుద్ధపున్
హెచ్చును లోచ్చుఁజూడ నొక • యీరముఁ జేరి పరుండు బడ్డచో
ముచ్చటయున్ దదన్యత న • పూర్వపుదుఃఖము నొందుచున్ భయ
ప్రోచ్ఛలితాత్ములన్ బెదరు • టోపిక నెట్టులొ చూచుచుండిరన్

కం॥ ఓహో! గణపతి! యందఱ
యూహలు ముఖచిహ్నములనె • యోపుదు తెలియన్
బాహాబాహికసమరో
త్సాహశ్రవణంబు సుంత • తలఁగి వినఁగదే॥ 52

సీ॥ బాహ్యాంతరింద్రియ • వ్యాపారసమ్యగా
కర్షణప్రౌఢిమ • కదన మెన్న
ననుచుఁ బిమ్మటఁ గొన్న • యాత్మంబోఁ వినియెదు
భల్లుకాధిపకృష్ణ • భండనంబు
తచ్ఛ్రుతాధికతీవ్ర • తనుమైన జాంబవ
తీభావయుద్ధంబుఁ • దెలియఁగనవు
ఇంగితజ్ఞుఁడవై చె • లంగు నేర్పరివీవు
సూచింప నంతయుఁ • జూఱఁగొనెదు॥

గీ॥ హితుఁడ వగుట మోదాంతరం • బెఱుఁగఁబల్కి
తరయుఁ జాలిన నిందెద్ది • యద్భుతంబొ
నీమనోవీథి నంతయు వర్ణించి
వలయు దెస నీవు వేడ్కన్ • ఫలముఁ గొనుము॥ 53

కం॥ అది యేహేతువచేతనో
మొదలిఁటి నుండియును గృష్ణు • ముఖవీథిఁ బడిం
బడిఁ జరింపంచెడి వల దన
వదలక జాంబవతి చూపు • వలఁగొని కడఁకన్॥ 53

ఉ॥ ఎక్కడి బాంధవంబొ; కను • మీ! తన తండ్రికిఁ గూర్చుకొంటె స
మ్మక్క! విరోధిపై శతగు • ణాధికమౌ తగులంబుఁ జూపెడున్

మక్కువ కిక్కులా నయన ♦ మండలముల్ దమలోని కాంతినిన్
గ్రక్కునలాగి యాపదలఁ ♦ గావఁగ డెంగము చాయఁ జోపఁగన్॥
చం॥ ఒకపరిఁ దండ్రి సేమమున ♦ కోపఁగ రాని మహోగ్ర దుఃఖమున్
బ్రకట మొనర్చి, యొక్కయెడ ♦ భవ్యతర ప్రబలానురాగ సూ
చకనయనాబ్జరాగమున ♦ శాత్రవుపైఁ దమ ప్రేమఁ జూపుచున్
జకితములన్ విశేషణము ♦ సత్య మొనర్చెఁ దదీయనేత్రముల్॥
మ॥ "పడియెన్ శాత్రవు" డన్న శబ్దమునఁ దీ ♦ పంబాలఁ గార్చీకటుల్
వడిగాఁ గ్రమ్మెడు నట్లు తన్ముఖమునన్ ♦ వ్యాపించు శోకావళుల్
"గడఁగెన్ గ్రమ్మరఁ బోర"నా నధిక సౌ ♦ ఖ్యం బాస్యమున్ గప్పఁ జం
దుడుకుం జీకటి దీపికాప్రభలు సంతోషంబు నెట్లట్లుగన్॥ 57
గీ॥ గణపతీ! భండనము పొంత జనఁగ వలయు
నాకు నీ విందు సందు కం ♦ దమ్ము లోలయి
హాయిగోను; మెందు వాక్రుక్క ♦ యంశ మొక్క
కాలమున జెప్పఁ జెక్కులఁ ♦ గనును కండ్లు॥ 58
గీ॥ సత్వము నుపాయమును గృష్ణు ♦ శౌర్యమునకు
బాసటగ నిల్చియుంట న ♦ బ్భండనమున
భల్లు కేంద్రుని యలసట ♦ బడలికయును
మించుకొలదిఁ గృష్ణు బలంబు ♦ మిన్న యయ్యె॥ 59
వ॥ ఆసమయంబున॥ 60

శా॥ ఓయీ! భల్లుకరాజ! నీవలసిన • ట్లొప్పారి కన్పట్టి దే
లాయీ యుద్ధము? నిన్నెటుల్ గెలువ కా•లంబేను చాలింప నీ
హాయిన్ గోరి హితంబు సెప్పెదను న•న్నాలించి మాణి
క్యమున్
న్యాయంబొప్ప నొసంగి సంతసమున•న్వర్ధిల్లు మశ్రాంతమున్॥

గీ॥ భక్తపరతంత్రబుద్ధి న • వ్వాసుదేవుఁ
డతని భుజబలగర్వంపు • టలుక కడిమిఁ
గనుఁగొనఁగ నాడుటయు భల్లు • కపతివరుఁడు
నాజ్యవర్థితానల మట్టు • లదటుఁ గొనచు॥ 62

కం॥ ఏదీ! నాయలయికయును
మీఁదట నీశపథములును • మిగులు వచనముల్
నాదండఁ గనుఁగొనెదు మూ
ర్ఖా! దడఁగొన కాగినిల్వు • మా! పోగుటకున్॥ 63

మ॥ అను పల్కుల్ దుదముట్టి ముట్టకయ వీ•ర్యంబంతయున్
బూని కృ
ష్ణుసహ్యత్ప్రతికముష్టిఘాతమున సిం•దూరింపఁగా మోదినన్
ఘనుఁ డాతం డొరిఁగెన్ ధరాతలి మహా•గర్వంబు సంతో
షమున్
దనుపున్ బెంపఁగ జాంబవంతుఁడు జయ•ధ్వానంబుఁ
బూరింపఁగన్॥ 64

గీ॥ అచట నందరు సంతుష్టు • లైరి ఘోర
శాత్రవుండీల్గె ననుచు. నా • జాంబవతి ము

ఖంబు మాత్రమె విస్మయమై • కానఁబడియె
గ్రహణసమయచంద్రాంకంబు • కరణి వాఁడి॥ 65

శా॥ ఆలోమూర్ఛఁదొరంగి కృష్ణుఁడు ప్రభూ • తాశ్చర్యులై యెల్ల హా
రాలోకింప లయోగుప్రిరాదగతి బా • హాస్ఫాలనల్ జేసియో
రీ! లావుంగల వాఁడవే యగుదు ర • మ్మీయంచు భల్లూకరా
ట్ఫాలాగ్రంబున మోఁదె వాఁడు వివశ • ప్రాణంబులన్ గూలఁగన్॥ 66

ఉ॥ కూలినఁ గాంచి రాణియును • గూఁతురు సేవకసంఘమున్ విము
క్తాలసయానలై పఱచి • యయ్యో పతీ! జనకా! యటంచు లోఁ
దూలుచు శాత్రవున్ గసరి • దూఱుచు గొల్లున నేడ్వ్రరంత గో
పాలుఁడు జాంబవంతు పన • పాయత వారలెఱుంగ నిట్లనెన్॥

కం॥ మీరా జిప్పుడ లేచును
మీరిందరు వగవ వలదు • మిసిమింతుండై
ధారుణిఁ గూలెనె గాని మ
రేరీతి భయంబు లేదిదే! కనుఁగొనుఁడీ॥ 68

మ॥ అను చాత్రీలదెసం గనుంగొనఁగ నా • హా యేమి చెప్పన్ వలెన్
వినదోద్వేగమహాకులత్వరసగం • భీరంబు భల్లూకరా
ట్తనయాప్రేక్షణమాల తన్నలమ యు • ద్ధవ్యక్తి చిత్రాంబరం
బున మాయంగఁ దదేకనిష్టనటఁ ద • న్మూర్తిన్ బ్రతిష్ఠించుచున్॥

మ॥ నిలువన్ ; స్త్రీలటువాసి యేగుటయుఁ బ్రా • ణివ్రాతములన్ దేఁగ దో
ర్బలగర్వోద్ధతి శాత్రవుండలుకఁ బో • రన్ బిల్చుటల్ జిత్తవీ
థులలోఁ జేరవ చోటు లేమి నటనెం • దున్ నిండి సుస్థాపితో
జ్వలమారూపము వేఱు చింతలఁ చటన్ • వ్యాపింపఁగా నిచ్చనే॥

కం॥ ఒక్కముహూర్తశతాంశం
బక్కరణిం నిలిచి పిదప • నరి దెస మొగమై
గ్రక్కున నాయతుఁడై యా
దిక్కునకున్ నడిచెఁ బోరుఁ • దీవ్రం బయ్యెన్॥ 71

మ॥ మణి మాహాత్మ్యమునన్ గుహాంతరమునన్ • మధ్యాహ్నమున్ రాత్రియం
దును దివ్యప్రభలుంటకాలమిది యం • చున్ దెల్పరాదయ్యెభీ
షణరోషోద్ధతి చిత్తులై గురుజయో • త్సాహంబులన్ బోరు కృ
ష్ణునకున్ భల్లుకరాజశేఖరునకున్ • చోద్యంబుగాదే భువిన్॥

ఉ॥ మూలుగుచున్ బ్రచండగతిఁ • బోరుచు మూర్ఛల మున్గి తేలుచున్
సోలుచు దూఁగుచున్ బరని • ష్పాదనవృత్తులఁ జెంగలించుచున్
నేలయొరర్చు చొండొరుల • క్రేవలనూరకయూర్పులార్చుచున్
జాలిఁ ద్యజించి పోరిరి కృ • శానుయుగంబన వారలుగ్రులై॥ 73

క॥ ఇర్వదియేడు దినంబుల
కిర్వురిలో భల్లుకేంద్రు • డెడ తెగని యనిన్
సర్వాంగసంధులవిసి య
పూర్వమహావేదనంబుఁ • బొసగించుటయున్॥ 74

మ॥ దరపై వ్రాలి, యిసీ! నరుండొకఁడునన్ • దర్పంబునన్ నేసెనా,
బిరుదుల్ గాల్పనె యంచు నాత్మఁ గడు ని • ర్వేదంబునన్
కుందుచున్
బరుపై రోషము శక్తిహీనతను దాఁ • బాటొందుటన్ సిగ్గు ము
మ్మరమై కంపము నొందఁ జేయఁ బరమా • త్మా! యంచు
మూసెన్ గనుల్ ॥ 75

మ॥ ఇది సంధింపఁగ వేళయౌ నని తదీ • యేష్టార్చితుండై మహా
పదలన్ బాపెడి రాఘవేశ్వరుఁడు శుం • భన్మందహాసంబుతోఁ
నెదురై సీతయు లక్ష్మణుండు దనతో • పర్యంకలన్ గూడి రా
నుదితార్కప్రభఁ దోఁచె నాతని మనో • వ్యూహంబులన్ వచ్చుచున్

శా॥ ఆనందామృతవృష్టిభల్లుకపతిన్ • హాయిన్ గనన్ జేసె మా
యానాట్యంబు సమాప్తమయ్యె రఘువం • శాధీశ్వరాలోకన
ధ్యానారూఢమనోంబుజుండయి బహి • ర్వ్యాపారలోలుండుఁగా
డా నిర్దోషుఁడు జాంబవంతుఁ డనఘుం • డై పుణ్యసంపన్నుఁడై

ఉ॥ ఆతఁడు కన్నులన్ దెఱచి • నప్పటి కాతురతౌచు భార్యయు
న్మాఁతురు నిల్చియుంట తన • కున్ బరిచర్యలొనర్చుచున్ జగ
ద్ఖ్యాతుఁడుఁ గృష్ణుఁడుంటయునుఁ • గాంచి లలాట నిబద్ధ
హస్తుఁడై
పూతమనంబుతో నతని • పూజకు భార్యను హెచ్చరించుచున్ ॥

శా॥ శ్రీకృష్ణా! నిను నిప్పుడే నెఱిఁగితిన్ • శ్రీరామునంశంబ వం
చీ కష్టాత్ముని దుండగంబు మదిలో • నేమాత్రమున్ నిల్పకే

నాకాయంబునకున్ సపర్యలిడు నీ • నాణెంపు దాక్షిణ్యమున్
నా కా యెన్న మహేంద్రపద్మభవులై • నన్ బల్కఁగా లేరనన్॥
చం॥ ఎవరవు నీవు? నాగుహకు • నేపని కై చనుదెంచి తీవటన్
వివరముఁ గోరకే నతి వి• వేక విహీనుఁడ నౌచు మూర్ఖతన్
బవర మొనర్చినాఁడ నల• బానిసమాట యథార్థమంచు నా
యవినయ వృత్తినాదౌరకు • నాగ్రహభాజనమై తనర్చెఁగా॥80
ఉ॥ కోరితిఁగాక గర్వమునఁ • గూలి నినున్ సమరంబు సేయ రా
డా రఘురామరూపమున • నాసురశిక్ష నొనర్చునాఁడు నా
నేరిమి చూపి చెప్పి కరు•ణింపుచు ధన్యునొనర్పరాదె యీ
ఘోరము నాకు నిప్పుడొడఁ • గూడక పోవుఁ గదయ్య
రాఘవా! ॥ 81

కం॥ అనుచున్ మది నెమ్మదిఁ గొను
నను వున్ గనలేని భల్లుకాధి • పుమేనున్
దన కేలనిముడుచు దయా
వననిధి హరి పల్కె శుభగ • వాగ్గుంభనలన్॥ 82

కం॥ లే లెమ్ము భల్లుకేశ్వర
నీలోఁ దప్పేమి లేదు • నిజ మిది నన్నా
కాలంబునఁ గోరిన వర
మీ లీల నొసంగ వలసె • హితకరమగుటన్॥ 83

గీ॥ ఆమణిని నేఁ బ్రసేనుని • హత మొనర్చి
యపహరించితి ననెడి ని • రాపనింద
తగులు టొకకారణంబుఁ గాఁ • దడయుచీ గు
హాంతరంబుఁ బ్రవేశింప • నయ్యె నాకు॥ 84

కం॥ నీకానాఁడొసఁగిన వర
మీకరణిఁ జరుపఁ గలిగె ♦ నీక నింద చనం
గాక యథార్థము వెలికిన్
బ్రాకిన, నారాక ద్వ్యర్థి ♦ ఫలమయ్యెఁ గదా॥ 85

కం॥ అనుచుఁ గరాకర్షణమున
ఘనుఁ డాతని లేవఁదీయఁ ♦ గాఁ నలఁత చనన్
మునుపటి యారోగ్యముతో
ననుపమముగ భల్లుకేంద్రుఁ ♦ డమరెన్ బ్రీతిన్॥ 86

కం॥ ముకుళిత కరుఁడై యాతఁడు
వికసచ్చిత్తాబ్జవీథి ♦ వేడ్క యదుకులా
ధిపుఁడను బంభరమునకున్
బ్రకట విహారం బొసంగెఁ ♦ బరవశుఁ డగుచున్॥ 87

కం॥ తల్లి పిఱుంద నిలిచి యదు
తల్లజుపై జాంబవతి సు ♦ ధాకరకిరణో
ద్యల్లీలఁ జూడ్కు లనుపుచు
నుల్లాసము మీఱ నతని ♦ యుల్లముఁ గొనియెన్॥ 88

కం॥ అన్యోన్యాకర్షణ నా
కన్యయుఁ హరి తొట్రుపడుటఁ గాంచి యిఁకను నే
ధన్యుఁడ ననుచున్ శుభవా
గ్విన్యాసత దుహితఁ బిలిచి ♦ వేడుక మీఱన్॥ 89

గీ॥ జాంబవంతుండు కృష్ణు హ ♦ స్తము గ్రహించి
జాంబవతి సిగ్గునన్ దల్లి ♦ చాయనుండ

డాని కరమున నుంచి సం • తసముతోఁద
దేవలగ్న మటంచు సం • ధించె వారి 90

కం॥ మణితో బాలామణితో
గుణాఢ్యుం డత్తమామ • కోర్కులు శతధా
గుణితఫలాప్తిం దనిపి వడి
దన యూరికి బయలుదేరెం • దద్దయు బ్రీతిన్॥ 91

గద్య

ఇది శ్రీ భారద్వాజసగోత్ర భువనగిరికుల
పవిత్ర కృష్ణాదక్షిణవిభాసి గర్తపట్టణ
నివాసి సుజనవరవిధేయ విజయ
రామ నామధేయ ప్రణీతం
బగు శ్రీగణేశ్వరీయమందు
చతుర్థాశ్వాసము.



# —* శ్రీగణేశ్వరీయము *—

## పంచమాశ్వాసము.

కం॥ శ్రీ సిద్ధీ బుద్ధీ మహి
ళా స్తోత్ర నిరంతరోజ్జ్వ ♦ లద్దివ్యకళా
న్యాసంగ ! భక్తమానస
వాసా ! కైలాస సుఖని ♦ వాస ! గణేశా !॥ 1

వ॥ అవధరింపుము. 2

ఉ॥అచ్చుటజాంబవంతునిగు♦హాముఖముఁ ద్యజియించిఖిన్నులై
వచ్చినవేటరుల్ దమకు♦ సార్వముతో మృతుఁడై ప్రసేనుఁడున్
జచ్చిన సింగముఁ బిదప♦శాద్వల భూమి నెలుంగు పాదపుఁ
గ్రుచ్చులు దోఁచుటల్ హరిని ♦ గూఢముగా గుహఁజొచ్చి
యేగుటల్॥ 3

మ॥వరుసన్ దెల్పుచునుండ గద్గదికభా♦వస్విన్నతద్వాక్యముల్
కరుణాపూర్ణభయప్రకంపజజలా♦క్రాంతోద్ధతన్నేత్రముల్
సరసన్ జేరిన రుక్మిణీప్రముఖకృ♦ష్ణస్వామిబాంధవ్యహృ
త్సరసీజంబు లదల్చి యూపె ముహురో♦ద్యద్బాష్పభంగంబులన్॥

మ॥అదరున్ గుండియఁ దొట్రుపాటొదవ కృ ♦ ష్ణాపాయ
మూహించి వా
రి దరిన్ మూఁగి ద్రుతోత్థులౌచు,గుహనే ♦ రీతిన్ బ్రవేశించె ద

త్పదచారుల్ గనలేదె మీరతనిఁ గోఁ • దద్గర్భమందెవ్వరే
నెదురై తాఁకిరె వాని? నింతకు సుఖుం • డే వాఁడు ?
రాఁడేటికిన్?॥ 5

కం॥ అని సీరపాణి మొదలుగ
గొనఁ గొన నందఱును బ్రశ్నఁ • గొన నెదురాడన్
దనికియు తెలిపిన్ గానక
మునులై వేటకులు తుదకు • ముకుళితకరులై॥ 6

గీ॥ అయ్యలారా ! క్షమింపుఁడో • యమ్మలార !
కొండబిల మట్లు చేరి వె • న్నుండు నిలువ
తన్ముఖంబున నుంటి మం • దరము మేము
యుక్కలరఁ జొచ్చె గుహ నతం • డొక్కరుండె॥ 7

మ॥ గవిలోఁ గృష్ణుఁడుదూరి యేగిన దదా • జ్ఞన్ దన్ముఖస్థానమే
మవధిన్ జేసి వసింపఁ గొంతవడి క • య్యభ్యంతరంబందు ను
ద్దవడిన్ ఘోరశిలాతరుప్రచయము • ద్ధంబొప్పచందంబుగాఁ
దవిలెన్ వీనులఘెల్లె గార్భటులసాం • ద్రధ్వానసందోహముల్॥

ఉ॥ ఆమొయి నాల్గువారముల • హార్మి శిలున్ వినవచ్చె ఘోరసం
గ్రామమహాస్వనంబు లధి • కాధిక గాఢములౌచు తద్ధతిన్
భూమి వడంకె నాచరియ • బ్రుంగు నొకో యనిపించెఁ దారక
స్తోమము దిర్దిరం దిరిగి • తోవలు బాసిన చందమై చనెన్ 9

కం॥ ఐదవనాఁడా యార్భట
మేదియు లేదయ్యెఁ గృష్ణుఁ • డీఁక జనుదెంచున్
వాదడఁగె గెలువఁ బోలును
మాదైవము చలువగోప • మండనుఁ డనుచున్॥ 10

కం॥ తలఁచితి మేసరికిన్ హరి
వెలికిన్ జను దేరకున్న • వేసరి గుహలోఁ
పెఁ జొచ్చి యేగఁ జాలమి
నలుగడలన్ జూచి మరల నాల్గు దిశంబుల్॥ 11

గీ॥ ఇరులునన్ ముండ్ల బురదలో • నిరికి కొన్న
వాని గతి జిత్తము త్తలం • పడఁగఁ గృష్ణుఁ
డెల్లి రేపా తేపా వచ్చునం • చల్ల నల్లఁ
గడపితిమి వెల్గుచోరని యు • కృత్తిక వని॥ 12

ఉ॥ ఆకలి దప్పి యాచనక • యూగతి నెమ్మది నాళ్లు లుండి సు
శ్రీకరుఁ డేఁగుదేఁడతనిఁ • జేరిన నూర్ద్వ్యోతాదు సూ బిలం
బే కరణిన్ జొరన్ దెలియ • దేమి యొనర్చెద నింక యుండి ని
ర్భీకుల సీరి సాత్యకుల • వేగము తెత్త మటంచు గొబ్బునన్॥ 13

గీ॥ పయనమై వచ్చితి మటంచు • భయము గదుర
వేటకాం డ్రింతయున్ భక్తి • విన్నవింప
బలుఁడు హలపాణియై పోఁ చెఁ • బయనమునకు
సాత్యకియు వాని వారించె • సరసగతుల॥ 14

కం॥ అన్నా! వెన్నుని బాహుస
మున్నతికిన్ మిన్న బలము • లున్నె ధరిత్రిన్
విన్నాఁడవె కా! యాతని
యన్నాటి ప్రతిజ్ఞ యిప్పు • డది తప్పునొకో • 15

ఉ॥ చుక్కలు రాలఁగా వలదె • సూర్యుఁడుఁ జంద్రుఁడుఁ దారకావళుల్
సుస్థిక్కి చలింపఁగా వలదె • సూరెల డాఁగలు దప్పిపోలుచున్

దిక్కరు లేకఁగా నఁదె•నీరనిధుల్ బడబాహ్యతాంగులై
డొక్కులఁ జూపఁగా నలదె• టొంపము కృష్ణు ప్రతిజ్ఞ తప్పినన్॥
ఉ॥ ప్రాతసమగ్రగుచోశకట•ముష్కరుఁ డట్టులడంగుచో మహా
వాత నిశాటుఁడీల్గునెడ • వాయుభుజుం డతిభీతి మ్రాల్గుచో
శాతదవాగ్మి యూరు తఱి • శాత్రవ శౌర్యశిఖాళి తీరుచో
నాతని కేలఁ గాసటగ • నాగిరి తద్బలరాశి దక్కఁగన్ 17

సీ॥ ఆవ్రలించి యశోద • కఖిల ప్రపంచంబుఁ
జూపఁ జాలిన విశ్వ • రూపమునకు
చిట్కెన కానగోటఁ • జిన్ననాఁట గిరీంద్ర
మచలంబుఁ జేసిన • యతి బలునకు
నలువ చిన్నంబోయి • నతిసల్ప క్రేపుల
సృష్టిఁ బూనిన జగ • త్స్రష్టునకును
నారదర్షికిఁ జిత్ర • నాటకం బెసగించు
సకల పరివ్యాప్తి • శాలునకును
గీ॥ ప్రతిన సాగదె ? యెదిరించు • బలముఁ గలదె ?
నలువకైనఁ జిచ్చుఱకంటి • విలువకైనఁ
ప్రబలహేత్వంతరంబుండ • వలయుఁ గాక
గడవఁ దప్పక శౌరిరా • గలఁడు నిజము॥ 18

మ॥ అనుచున్సాత్యకిపల్కనందఱును ధై•ర్యాలంబితస్వాంతులై
చని రారుక్మిణియాయశోదయును బు•ష్పద్రవ్యముల్ బూనితో
డనదాసుల్ జెలులున్ గమింపమది గా•ఢంబైన భక్తిప్రభన్
ఘనగౌరీవరవిగ్రహంబు దరియం•గా నాత్మ లర్పించుచున్॥ 19
మ॥ వరగౌరీవ్రత మాచరించు నెడఁ ద•ద్వార్తాళి నాలించి స

త్వర సాత్రాజితి కాళికాలయమునన్ • బ్రాహ్మోపవేశస్థయై
గిరిరాట్పుత్రి! నిరంతరంబును నినున్ • గీర్తించు లక్ష్యంబు మ
ద్వరదానం బొనరింప లేనియెడ మా • త్ప్రాణంబు లేలా వృథా॥
కం॥ అని వేనలిఁ దన గళమున

కనువు బరిచి మానసంబు • నందలి తెగువన్

దన హస్తద్వయమున యుం

దినుమడిగాఁ జూపఁ దొడఁగు • నెడ నెడఁ గలుగన్॥ 21

శా॥ "ఓహో! యాదవులార! మాధవునకై • యోర్వది దుఃఖింపనే
లా హైమాక్షతలూనుమూర్ధ్నము వివా • హజ్యోత్స్నలస్ఫర్వఁగా
బాహాద్వంద్వము సన్మణి ప్రభలతో • బాంధవ్యమాడంగ ను
త్సాహోన్మగ్నత వచ్చునాతఁడిటకున్ • సంతోషసంధాయియై॥"
మ॥ మింటన్ బారిన తద్ధ్వనిన్ విని యుదే • మీచిత్రమీ వాక్యమే
వెంటన్ వచ్చెనో గాని యాశ్రితజనా • భీష్టప్రదంబై చనెన్
గంటిన్ దెప్పవలెన్ మమున్ గనెడి యా • గౌరీకటాక్షంబె మా
తంటా వాపెనటంచు సంద అనుమో • దస్వాంతులై రయ్యెడన్॥
కం॥ ఈసందర్భము విని సం

త్రాసితచిత్తమునఁ గలఁతఁ • దవిలి భిడియ మా

వాసము విడనీయని చో

నాసత్రాజిత్తు బహు వి • ధాలోచనలన్॥ 24

కం॥ కుందుచుఁ గుములుచుఁ దనుఁదా

నిందించుచు మోహితనుడుకు • నీటివలె మనం

బం దగడు బడుచు మ్రాల్గుచు

గందరగోళమునఁ గూలి • కడు నిస్పృహుఁడై॥ 25

ఉ॥ ఏగతి నా దురాగతము • లింకెఱు గృష్ణు మహానుభావునే
నేగతిఁ జూచువాఁడ మఱి • నే గతిఁ గైకొనువాఁడ మీఁద నా
కే గతులున్న వో మనస • దెందును నిల్కడఁ జెంద దయ్యయో!
యీగతి నాచరింత మని • యెన్నికొనంగ నసాధ్యమయ్యెడిన్॥

ఉ॥ ఊరక లేసిపోని యభి • యోగము నాదెసఁ బూని తీవిదే
నీరతనంబు దీని నిఁక • నేనియు బాగుగ దాచికొమ్మటం
చీరసమెత్తి కృష్ణుఁ డనె • నేని భరించెద నెట్లు దాని ని
క్రూరపు నెత్తిపోటునకుఁ • గూడునె నిల్వఁగ సాటివారిలోన్॥

శా॥ నీఁడేచూడుఁడు చూడుఁడర్థపరుడై • విశ్వేశ్వరున్ గృష్ణునా
జేడాగోడములాడి సిగ్గిలక హా • యిన్ జెల్లుదయ్యా యటం
చాడన్ జొచ్చెనటంచు నందఱునుఁ బో • నాడంగఁ దత్తీక్ష్ణతన్
నాడెందం బెటులోర్వ వ్రయ్యక యకృ • ష్ణా యేమి చేయందగున్।

మ॥ అనిచింతించుచు నిద్రదప్పికయు నా • హారంబు లెక్కింపకే
మనసే దేనొక నిశ్చయాంశమునకున్ • మళ్లింప యత్నించుచున్
దనకాకార్యమసాధ్యమైన ఘనచిం • తన్ గూలు చాత్మీయసా
ధనివిష్టుండయియుండి ప్రాంతవనమ • ధ్యంబున్ విలోకింపుచున్॥

కం॥ ఇటునటునడచుచు నాగుచుఁ
దటుకునఁ గూర్చొనుచుఁ బెలుచఁ • దనహస్తమునన్
గటములఁ బుణుకుచు లేచుచుఁ
బటునిశ్వాసంబుఁ గొనుచు • వనమున్ గనుచున్॥ 30

శా॥ డోలాందోళితమానసంబున నివి • ష్టుండైనచో నయ్యెడన్
"బాలా! శాంకరి పల్కు తథ్యముఁ గనీ • ప్రాణేశ్వరుండైన గో

పాలుండిండులఁ జేరె సౌఖ్యముగఁ బుం♦ వ్వ్రద్వయసంయుక్తిపైఁ
లేలెమ్మా జగదంబకున్ బ్రణతి నో♦ లిన్ భక్తినర్పింపఁగన్ ॥

కం॥ అనియాత్మజలోనెచ్చెలు
లనుమాటల నాలకించి ♦ యాకార ములుచితిన్
గనుఁగొంటి పిమ్మప్రీతియటం
చినుమడివేగమున నెగసి ♦ దోఁగెన్ నవికిన్ ॥ 32

కం॥ ఆనాక్యమెయిఁ గోకయెడ
ధావద్గతి దివ్యరత్న ♦ ధరుఁడై యటకున్
వేవచ్చుమను జువేగ
శ్రీవిభవముఁ బెంచెగాడ్పు ♦ చేతముకంకెన్ ॥ 33

కం॥ ఆమనుజుఁ గాంచి వ్రీడా
క్రాంతయెసత్యభామ ♦ కదురయమున నా
రామ మహీంజము మాటున
సీమంబని నిలిచె సఖులు చెంగు గ్రహింపన్ ॥ 34

శా॥ అబ్బో! పుట్టక పుట్టినే యిచట సి ♦ గ్గానమ్మనానాట నీ
తబ్బిబ్బున్ గనకున్న వారికడ నీ ♦ తాటోటుజూపం గనా
నుబ్బున్ గుబ్బలమోన్న నేకదలతా♦వ్యూహంబులన్ మ్మాధకున్
జుబ్బంజూరగఁ గౌగిలింప.జనితీ ♦ చోద్యంబిదేలా? సఖీ! 35

మ॥ వహావా! జాణవసంగనీవ! దినము♦ బ్బ్రాణేశుతోఁ బల్కుచున్
న్నహా వాసంబొనరించుచున్ దిరుగుచున్ ♦ శాసింపుచున్నంగము
న్నహా నాగోపయటం చుఁగౌగిలిఁగొనన్ ♦ గుప్పించుచున్ దత్సుఖ
స్పృహానన్యంబులవీడుచున్మెలఁగియీ చోద్యంబిదేలా? యిఁటన్ ॥

ఉ॥ భావమునం దనేకవిధభా ♦ వరసమ్మతిఁ గొల్ప యందులన్
హావడి నీకుఁ గూర్చిన ద ♦ యారహితుండిదె వచ్చె వానిపై
నేవగ నైనఁ దీర్పవల ♦ దేవగ బాహులఁ బట్టి వేవలెన్
బోవఁగ నీక కట్టుమెటు ♦ పోవునొ సిగ్గిలనేల? కోమలీ॥ 37

చం॥ తెలిసిన దానవే యగుదు గి-దేయుటె సియుపదేశ ఫక్కినా
డలరఘునాయకుం డినజు ♦ నాగిన యట్టుల సత్య భూరుహం
బుల మఱుగొప్పఁ బొంచి యుడి ♦ వ్రా యపాంగనిరీక్షణాంబకం
బుల నతనిన్ జయింపుము మన ♦ బుద్ధులు పోక యఁజాలవుందుమా॥

మ॥ అనుచున్న చ్చెలులందుమూగి తనశో ♦ కనవ్యోక్త్యనున్నవ్వాల
ద్దనుకన్ వృక్షము మాటునన్ నిలిచి సంత్యాతస్వవారందఱన్
దనవిస్ఫారితనేత్రయుగ్మమున సం ♦ దష్టాధరోష్టంబునన్
సునిబద్ధభుజులన్ గరాగ్రమునను ♦ స్సోయంచు వారింపుచున్॥

క॥ ఎడనెడఁ గ్రీజ్ఞాపుల
నొడయుని దడవుకొనుచుబ్బి ♦ యుఱ్ఱూతలుఁగా
మెడఁగడియువైచు భావము
గడబిడలోనై లతాంగి ♦ కనుఁ దడఁబడుచున్॥ 40

వ॥ నిలిచినమొడ, నవ్వధూపరంబునకుమ తురంగలించు మెఱుంగు తెఱంగకు నక్కుఱంగనేత్రం గని దూరంబున నయ్యదుప్రవరుండు బహ్వాకర్షితమనుండై॥

క॥ ఆసాపసనేత్రిను యరా నా
సాత్త్రాజిత్తి! యద్ది ♦ రా! పొంకములై
భాసిలుచు నొకటికొక్కటి
వాసిన్ సరిదూగు నవయ ♦ వంబుల బెడఁగుల్॥ 42

ఉ॥ పైటచెఱంగు గాలికిఁ త • పాతపలాడఁ దళుక్తళుక్కునన్
మీఁదఁ దదీయరత్నగోను • మేనిమెఱుంగులయారె! నేటులై
నీటునదాఁగుడాడు తరు • ణీకుచయుగ్మము కట్టుపట్టులై
గాటముగాఁగ మన్మనము • గట్టువడెన్ చలితత్వమేదఁగన్॥ 43

గీ॥ మున్ను నే విన్నదానికి • నొనసి యిచట
నిపుడు గన్గొన్నదానికి • నెంచిజూడ
హస్తిమశకాంతరం బుండె • నౌర దీని
కమ్మ సాబగూరు టెంకెంత • గలదొ కలియ॥ 44

గీ॥ పాటి తరువుల నాఁ పిన్న • నాట నిడిన
పాటు గమనింప దీ గరు • వంపు భూజ
మౌర! నా కడ్డమై మనో • హారిని వెనుక
వైచికొనవచ్చె నేఁటి ని • బ్బరము గలదొ॥ 45

మ॥ జలదాచ్ఛాదిక మంతయుంత తొలఁగన్ • జంద్రాంశ
మింతంత గ
న్నులకామోదమొసంగురీతిన చటన్ • దోఁబూఁచులన్ గొల్చు నా
లల నాదిన్యత రాస్యమండల సుహ • ల్లాభంబు నిత్యంబుఁగాఁ
జెలఁగన్ గల్గునె నాకుఁ గష్టఫలమై • చిత్తంబు రంజిల్లఁగన్॥

శా॥ శీతంతూత్తమబంధసంయమితసు • స్వేచ్ఛావిహారంబు ఖ
ద్యోతం బంతకు నంత నిశ్చలత ను • ద్యోగించు చందంబుగా
వీతాన్య స్పృహుఁడై ముకుందుఁ డటఁ ద • న్వీవీక్షణాపేక్ష ని
శ్చైతన్యస్థితి నిల్చె తత్ప్రిబలవి • త్పౌనస్యగాకర్షణన్॥ 47

శా॥ సూటిన్ నీకడగంటిచూపులను ను • చ్చుల్ బారి బంధింపఁగా
నీటుల్ జార పదంబు లాడ కఖిలో • న్నిక్షిప్త నేత్రిద్వయిన్

వేటం జిక్కిన మోటువార్వ మనను ♦ ద్వేగించు నవ్వానినో
బోటీ యే నవసూత్రి మూని బెరుకుల్ ♦ బోసాధుఁగావించెదో॥

కం॥ అని యొక నెచ్చెలి పల్కిన
వినియు విననియట్లు తొలఁగి ♦ వేడ్క వెనుకకుఁ
గని గనని యట్లు కృష్ణుఁడ
దనురూపుఁగ నెఱిఁగి సత్య ♦ తద్దయు నలరెఁ ॥ 49

గీ॥ లలి నయనస్కాంతి బలమండ ♦ లంబు జొచ్చు
కాంత మన్యత్రిఁబో శక్తి ♦ మంత మగునె
ఘనభవదపాంగరుగ్బలా ♦ కర్షితుండు
కృష్ణుఁ డెటఁ బోవు వెంబడిఁ ॥ గెలుచుఁ గాక॥ 50

కం॥ రా రమ్మటు దాక్షాయణిఁ
జేరఁ జని మ్రొక్కు లెల్లఁ ♦ జెల్లింపవలెఁ
గోరంత ప్రొద్దు గ్రింకెను
నారీమణి యనుచు సఖులు ♦ నడువఁ దొడఁగఁ॥ 51

శా॥ లంగర్వేసిన యోడ పెన్నసరుగా ♦ లంఘించుజంఝామరు
త్సంగత్యంబున వార్థిభంగముల నృ ♦ త్యంబాడుచుఁ దూఁగుకీ
వింగృష్ణప్రిణిబద్ధమానసము ను ♦ ద్వేగించు వాక్యాళి స
ర్వాంగాందోళనగూర్చు నెచ్చెలులతో ♦ నా సత్య యేగెఁ వనిఁ ॥

శా॥ గౌరీపూజకు సత్యభామతరలెఁ ♦ గళ్యాణపుఁ వేడ్కకున్
రా రండో శుకవాణులారా! తనివా ♦ రన్ మంగళం బాడుచున్
మీరల్ బల్లవపాణులార! బువ్వులన్ ♦ మేల్మిన్ గయింగొండు సు
శ్రీ రంజిల్ల వరుండు వేచెడి నటన్ ♦ శీఘ్రింబె పోవన్వలెన్॥

కం॥ అని యాడు కొనుచు నెచ్చెలు
లనుమోదభరాత్మ లగుచుఁ నను గమన మునన్
జనుచుండఁ దన్ని వేళత
మనస్కుఁడయి కృష్ణుఁడచటు • మాటికిఁ గనుచున్॥ 54

మ॥ పులకల్ వారిన మేనితోఁ బ్రబలస • మ్మోదాంతరంగంబుతో
నిలు వెల్లన్ గడుఁ బొంగనం చెలుఁగ సాం • ద్రీభూతమై సంతసం
బలుగుల్ వారెడునట్లు నశ్రువులు నే • త్రాంతంబులన్ నిండ నా
లలనామన్మథుఁ డుబ్బె సత్య నిజసం • లగ్నాత్మ యాటన్ గనన్॥

ఉ॥ ఆమొయి సమ్మదాంబుధి పి • హారము సల్పుము కుందు నచ్ఛ మా
మోమును నంబరంబున ని • పూర్వపు మబ్బు జనించె సత్యభా
మామహిళామణిన్ దనకు • మామయొసంగడో యన్న యూహం
బ్రామిన నంత దేహము నఁ • బర్వె దుర్తిరంబుఁ గ స్వేదబిందువుల్ ॥56

ఉ॥ పో మొదసమ్ముఖంబునకుఁ • బూటసడిగ్ వివరించి దాని య
న్యాయము పాటెదగ్ విపి • మందలి చర్య నెఱుంగఁ బల్కఁ సు
జ్ఞేయమణిగ్ గయిగ్ జెలఁగఁ • జేసి ముసం బెటఁగింతు మామ సు
ధ్యేయుఁడుఁ గాని చో వలయు • తెన్నటుపై మదినిశ్చయించెదగ్॥

మ॥ అనిగోవిందుఁడు సౌధమున్ దరియుఁ "గృ • ష్ణా! పాహి!
మాం పాహి! మ
ధ్యనశోకపరిచలన్మనో వికల వా • క్సంజాతనింబా గిరా
మనుకంపాతిశయాత్ క్షమస్వ" యనుచున్ • బార్థించు
సత్రాజితున్
గని మొన్ ముంగిలియందు సేవకులు కా • న్కల్ పట్టుచున్డోడరాగ్॥

కం॥ మామా! చెప్పిన చొప్పున
నీమణిఁ గొనివచ్చినాఁడ నిజ మిదియగునో
యేమో కనుఁగొని బహుమతి
నేమింపుము నీమదికి నెరవగునటులన్॥ 59

వ॥ అని కృష్ణుండు స్యమంతకమాణిక్యంబు నొసంగఁ
బోవం గైకొనక॥ 60

ఉ॥ చేసినతప్పు మెంచు, మదశేషధనంబులు భాగ్యభోగ్యముల్
దాసజనంబులున్ సుతయుఁ దానును బ్రాణములున్ ద్వదీయమా
దోసిలి ధారవ్రాసినను దూగగను తత్సమమౌనె ముకుంద! యీ
వేసము లేల బ్రోవుమని వేఁడెద దుర్బలు నన్ క్షమింపవే॥ 61

ఉ॥ కంటి భవత్కటాక్ష మహిమాఘత మత్సుతయందు బర్వుటల్
గంటిని నిమ్మహత్మ్యతిన్ వెరవంగా నిఁక నేటికి సర్వసిద్ధమై
యుంటి నిటన్ భవదాజ్ఞఁగొననో యి! జనార్దన జాగిదేల ర
మ్మింటికి జోస్యులెంచి లిఖియించిరి దివ్యముహూర్తమిత్తరిన్॥

వ॥ అని బహుమానమునఁ గళాచరణపురస్సరంబుగా నను
కూలగమనుండగు సన్నిశాచరదమనుం గొని యాసత్రాజిత్తు
నవరత్నతోరణభ్రాజితం బగు గృహరాజంబుఁ జొచ్చి యంత
కొమున్న సమాహూతులై చనుదెంచు బంధుబృందంబు
లర్హపీఠాదికంబుల నధివసింప యథావిధి వైవాహికాచార
పరిచారంబుల నార్యజనాశీర్వాదంబులతో నిర్వర్తించి యప్పరి
షన్మధ్యంబున ముకుళితకరుండై నిలువంబడి॥ 63

ఉ॥ పండితులార! మిత్రగురుబంధుసమూహములార! ధర్మదాం
ధుండు నిరస్తధర్ముఁడవధూతసమస్తవిధుండు ధిఃకృతా

ర్యుండు శఠుండు వీడనుచు•నోపిక మాలి ననున్ద్యజింప కే
నిందుసభస్వినుండు మహా•నీయులు నామనవిన్ గృపామతిన్॥ 64
చం॥ సతులు సుతల్ సుతుల్ హితులు•జ్ఞాతులు బంధువులున్ ధరాపతుల్
యతులు విధాతయున్ హరిహ•రాదులు నిబ్బరమైనపూన్కి నా
యతులయి మందభాగ్యుని మ•హాసుఖవంతునొనర్ప లేరు ప్ర
స్తుతమునకే నిదర్శనము•జూడుడు తేటఁగ విన్నవించెదన్॥ 65
చం॥ కరుణకటాక్షమందుదొలు•కన్మృదువాక్కతిఁజిందిపర్వస
త్కరకరహస్తసంగతవి•కస్వర సన్మణిదీప్తిపుంజ భా
స్వరఝురయుక్తిన్ ననుపమ•సౌమ్యత నాదరికేఁగుదెంచు భా
స్కరవరదైవతంబు సుఖ•కార్యనిబద్ధుఁడు కాఁడె నాదెసన్॥
చ॥ హరి పరమాత్మ సర్వభువ•నావన కారణమూరణాఢ్యుఁడు
ర్వరజనియించె శిష్టజన•వైరివిఖండనకై, యిటుల్ పరా
త్పరుఁడగు నాతఁడొక్కమణి•పాలిట నాసవహించి యాత్మకిం
కరుల వధించునే యనెడు•జ్ఞాని మదాత్మజ నాకు వైరియే॥ 67
ఉ॥ కాఁడుసుమీ యతండుభ్రమ•గ్రమ్మమనంబు చలించునీకు నీ
వేడనొ నీరసంపుమణి - యేడను సర్వజగన్నియామకుం
డేడను చూడుమీ వెడఁగ - యేటికి శోకహతిన్ బరేశు ని
ట్లాడెదవంచు బోధనిడు - నాత్మ మదీయహితంబుఁగోరదే॥ 68
చం॥ అచలితమైన యా యునికి•యందు గభీరత మత్కఠోర వా
క్చయములన్ దదీయముఖ•నేత్రకరస్థితి నిస్తరంగమా
టచట సదోషి శ్రీహరియ•టంచు దృఢంబుగ సాటవేరుపా
నిచుళవృతాస్మదంధతర•నేత్రయుగంబది చూడదయ్యెఁగా॥ 69

ఉ॥ చేసితి నెవ్వరెప్పుడును • జేయని ద్రోహమునిట్లుశ్రీయశో
దాసుతు మ్రోలఁబూర్వసుకృ • తంబిసుమంత చెలంగ నారసా
భాసము నెన్నకే హరి కృ • పామతి మత్సుతనిట్లు గైకొనెన్
నాసముఁ డౌ కృతార్థుఁడు కనం • బడఁడే జగమందు నేనియున్
చం॥ సకల చరాచర ప్రభువు • సమ్మతినాకిటనల్లుఁ డయ్యెఁబు
ట్టుక చరితార్థముం గనఁ గ -డుంగడు-లుబ్ధుఁడనై ముకుందుశౌ
రిక కెదిరించి యీగతిన • రిష్టములొందితి సిగ్గువచ్చె నా
సకలము నింక శ్రీహరిక వ • శత్వమొనర్చి మునిత్వమూనెదన్ 71
కం॥ అని కృష్ణున కభిముఖుఁడై
వనజోదర! ప్రేమ సత్య • భామను నాపు
త్రినిబోలి నాసమస్తము
ననుగ్రహమునన్ గొనంగ • దయ్యమతింతున్॥ 72

వ॥ అని పశ్చాత్తాపసంతప్త మానసుండగు మామనప
వారించి సభాసదులం బరికించి గంభీరవాగ్గుంభనాసంస్తం
భితసభారంభుండై యయ్యశోదాడింభకుండిట్లువచించె॥ 73

కం॥ గణనాథు పర్వమునఁ ద
ద్ఘనుఁగొల్వక పాలఁ జంద్రు • గన్గొను టేభం
గి నిరాపనింద నాకుం
బానుపడె దానికి నితండు • బూటమె చెప్పుడీ॥ 74

ఉ॥ ఆగణనాథుఁడున్ సుముఖుఁడై కరుణించుటనాకుభండనో
ద్యోగజయంబు సర్వసుగు • ణోజ్వల భాగ్యవతీ యుగప్రభా
భోగముఁగల్గె, నిందచనె, • పుణ్యుఁడితం డిటుచిన్నఁబోయి యీ
త్యాగ మొనర్ప నేమిటికి • తత్వమెఱుంగఁగ మీర బల్కుడీ॥ 75

వ॥ అని పెద్దలచేతం జెప్పించియు తాను చెప్పియు మామనోడంబరిచి శమంతకమణి నాతనికొసంగి రుక్మిణీ జాంబవతీ సత్యభామా సహితుండై కృష్ణుం డెల్ల భక్తుల రక్షించుచు సుఖంబుండె॥ 76

గీ॥ గణపతీ ! త్వత్సమారాధన • క్రియను నిటులఁ
దెల్పుదురు పెద్ద లిం దెంత • తేట గలదొ
"సర్వశక్తిమయుం డగు • శౌరి లోక
కర్మబంధ జాలంబులఁ • గట్టువడునె॥ 77

శా॥ తల్లీ! చెల్లెల! తమ్ముఁడా! మనకు నే • తన్మాత్ర కీర్తి నీ కల్లోఁ బిడియేల నీఘను మహా•త్మా కారుణ్యాతాస్ఫూర్తి నా యుల్లంబందుస్ఫురించు నూహ వినుఁడీ• యోహ్పాని; సద్భక్తి ధీ రోల్లాసంబుల కెల్ల నియ్యదియసుం•డొప్పైనచు కాంసియా॥78

సీ॥ నారాయణుఁడు సర్వ • కారణుం డఖిలాంత
రవ్యాప్తుఁడజుఁడు ప • రాత్పరుండు
నఖిలస్వతంత్రుండు • నఖిలశక్తిమయుండు
నఖిలుండు భువనోద్భ • వావనాది
లీలామయుండు ని • ర్లోలుండు కాలస్వ
రూపకుండాశ్రిత • పాపకుండు
సగుణుండు నిర్గుణుం • డగణితైశ్వర్యుం
డనపాయుఁడు నమేయు • డఘవిదూరుఁ

గీ॥ డనుపమానుండు ధీరన • రాగ్రగణ్యుఁ
డనగవివిధప్రకార వా • హ్యాళిబరచు
నాయనిర్వచనీయ మ • హాత్వతత్వ

మనుచుఁ దత్త్వజ్ఞు లెన్నుటల్ ♦ వినఁగ లేదె॥ 79
శా॥ వేదాంతజ్ఞులు నిర్గుణప్రభ యె సం ♦ విజ్ఞేయమం డ్రన్యులా
వాదుల్ మాని హరిన్ హరున్ గణపతిన్ ♦ వాణీపతిన్ భార్గవున్
నాదబ్రహ్మము మున్న సంఖ్యగుణ చి♦హ్నప్రాజ్యనామాళిచే
నా దైవంబును గొల్చుచుండుటలు క♦న్నారంగ వీక్షింపరే॥ 80
చ॥ కొలిచిన వారి చిత్తముల ♦ కున్ సరిగాఁ దదనేక భావలీ
లల నపు డప్పుడొప్పుచుటయె ♦ లక్ష్యముసూ! వరభక్తియోగస
ద్విలసితమార్గగాములకు ♦ వేదమయున్ దెలియంగఁ, దన్మనో
బలజనితోరుగాధలకుఁ ♦ బట్టిది కాదది నాఁగ నేటికిన్॥ 81
శా॥ ఏనామంబుల నెవ్వఁ డేయెడ నెవం ♦ డేరీతి నర్చించినం
గానీ భక్తియెలర్పఁ జిత్త మతఁడే ♦ కస్థాయి నొందించిన్
శ్రీనారాయణసన్నిధానమునకున్ ♦ జేరున్ విధూతాఘుఁడై
యానామంబున శ్రీగణేశ్వరుని నెం ♦ దర్చింతమే కాత్మతన్ 82
గీ॥ ప్రియహితుల నుండ్ల నిటులె మూ ♦ ర్తిభవించి
వారికోరిక లిడు గణే ♦ శ్వరుని భక్తి
దనర దర్శించి రావలెఁ ♦ దమ్ముఁగుఱ్ఱ
వేగ మకుతల్ గొని రమ్ము ♦ జాఁగఁ గేల 83
శా॥ ప్రొద్దాగుం గెనగంబునుండి పడు వాఃపూరంబనన్ గాలమా
హాద్దు ల్లేమి క్రమతంబుఁ జాటెడి గణే ♦ శారాధనాధీనమై
సద్దుల్ జేసెడి చిత్తమో! జనని! పూ ♦ జాద్రవ్యసంయుక్తి నీ
వద్దీసౌగృహమందు నిల్పఁగదె మృ♦ష్టాన్నాది నైవేద్యముల్॥
చం॥ అని సకలోపచారముల ♦ నందఱు నన్ని తెఱంగులన్ ద్వాద
ర్పన మొనరించి నీదగు ప్ర ♦ సాదము సాపడి వేగుజామునన్

నినుఁబనుపంగ నౌననెడి • నిర్ణయ మాత్మలఁబర్వ నుత్తలం
బునమది తత్తరింపనొక•మూర్తముగాఁ జనె నా నిశీథియున్ 85

గీ॥ విధివశం బిట్టిదనుచును • పెద్దలనుట
బాహ్యచిహ్నాల నిన్నిట్లు • పనుపవలసెఁ
గాని నిమిషసహస్రాంశ• మైననన్ను
విడచి నిలువంగఁ గలమె? యో! • విఘ్నరాజ!॥ 86

చ॥ అరయఁగ శాలివాహనశ • కాబ్దము మూర్తులు మూర్తులుం దిగం
తరములు జందురుండుఁ గలుగు • సవ్యవిరోధికృత్తోత్తరాయణ
స్ఫురణ విశాఖ కృష్ణదశ • మిల్ కుజవారమునాడు భక్తిక
బ్బురము గణేశ్వరీయకృతి • పూర్తినొసంగెద శ్రీగణాధిపా॥ 87

చం॥ సకలచరాచరాంతర వ • సత్పరమాత్మవు నీవు కాన్కగా
నొక రొక దాని నీకిడఁగ•నోపుదు రే? యిదికోర్కెయంచు నీ
కొకఁడు వచించు నందనుక • నుండుదె నీ? వతిభక్తితో భవ
న్నికటమునన్ మదీయకృతి•నిల్పెదఁ గైకొని ప్రోపు మందఱన్॥

గద్య॥ ఇది శ్రీ భారద్వాజసగోత్ర భువనగిరికుల
పవిత్ర కృష్ణాదక్షిణవిభాసి గర్తపట్టణ
నివాసి సుజనవరవిధేయ విజయ
రామ నామధేయ ప్రణీతం
బగు శ్రీగణేశ్వరీయమందు
పంచమాశ్వాసము.

సర్వంబును సంపూర్ణము.
స్వస్తిసర్వేజనాఃసుఖినోభవంతు.